# అచ్చ తెలుగు రామాయణంలో

# భాషావిశేషాలు





డాక్టర్ కె. వి. సుందరాచార్యులు

అచ్చతెలుగు రామాయణంలో భాషావిశేషాలు
Acchatelugu Ramayanamlo Bhashavisheshalu

ప్రథమ ముద్రణ : 1993

ప్రతులు : 1000

తెలుగువిశ్వవిద్యాలయ ఆర్థికసహాయంతో ప్రచురితం

వెల : రూ॥ 60-00



ప్రతులకు :
K.V. లక్ష్మణస్వామి
H.No. 23-6-121/2, హరీబావులి,
హైదరాబాదు - 500 265. ఆం. ప్ర.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
H.No. 1-1-517/B/1
న్యూబాకారం, గాంధీనగర్,
హైదరాబాద్ - 500 380
ఫోన్లు : 611413, 600547

# గుమ్మడిదల

# కళ్యాణ రామునికి



కైంకర్యం

# ముందుమాట

'అచ్చ తెలుగు రామాయణంలో భాషా విశేషాలు' వ్యాసానికి ఎం. ఫిల్. పట్టా ఇచ్చింది ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు శాఖ. మార్గదర్శకత్వం వహించింది. డా॥ నాయని కృష్ణకుమారిగారు.

ప్రచురిస్తున్నది చిరంజీవి కె.వి. లక్ష్మణస్వామి ఎం. ఏ.

ఆర్థిక సహాయం అందించింది తెలుగు విశ్వవిద్యాలయం, మిత్రులు, శిష్యులూను. ప్రెస్సు కాపీ మొదలుకొని అన్ని బాధ్యతలు నిర్వహించి పీఠిక కూర్చిన మిత్రుడు డా॥ డి. చంద్రశేఖర రెడ్డి.

ఆంధ్రేతరులకు ఈ పుస్తకాన్ని పరిచయం చేస్తున్న మిత్రుడు కాకాని చక్రపాణి. నచ్చే విధంగా ముద్రించింది పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి శ్రీనివాస్‌గారు. ముఖపత్ర రచన చేసింది శ్రీ బాల శ్రీనివాస్. ఈ పుస్తకం చదివి, ఆనందించి, ఆదరించేవాళ్ళు సాహితీ బంధువులు.

అందరికీ కృతజ్ఞతలు.

కె. వి. సుందరాచార్యులు

# ఈ కృతి పోషకులు

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రీయుతులు చెన్నమనేని పద్మ-రాంమోహన్‌గారలు, హైదరాబాదు | | రు॥ 1116.00 |
| 2 | ,, | చేపూరి విజయలక్ష్మి-యాదగిరిచారి దంపతులు, గ్రీన్‌పార్కు కాలని | రు॥ 1016.00 |
| 3. | ,, | నాగపురి అంజనీ - నర్సింహాచారి గారలు, నాదర్‌గుల్ | రు॥ 1016.00 |
| 4. | ,, | ఏనుముల పద్మావతీ-ప్రభాకర రెడ్డి గారలు, జనుంపల్లి | రు॥ 500 00 |
| 5 | ,, | శ్రీ శ్రీనివాసా ట్రేడర్స్, గుమ్మడిదల | రు॥ 558.00 |
| 6. | ,, | సి. శ్యాంకుమార్, ఆసిఫ్‌నగర్ | రు॥ 301.00 |
| 7. | ,, | హంసాల హిరణ్య, చందూలాల్ బేల | రు॥ 251.00 |

# PREFACE

Man experiments and acheives progress. The creative zeal in man does not permit him to remain static and propels him to discover new things and tread new avenues.

Telugu, a branch of Dravidian family, has enriched itself by its intimate contact with Sanskrit. It's heavy borrowing from that classical language made the erier scholars misconecive that Telugu was a product of Sanskrit. Earlier, poets used a diction - a hormonious blend of Telugu and Sanskrit. But the later poets showed a preference to such a heavily Sanskritized diction that some of the Telugu verses looked like sanskrit slokas. Ponnekanti Telagana who tasted the sweetness of Chaste Telugu wondered how it would be if the whole work is put in Chaste, unmixed Telugu His experiment 'Yayati Charitra' became a great success. He, thus, became a pioneer of a new genre of Telugu literature. One of the prominent and well - known followers of Telagana was Kuchimanchi Timma Kavi.

Of the 15 literary works, which Timmaya penned, two poetic works were exclusively written in Chaste Telugu one of them is 'Ramayana'. The story of Rama has been for ages a fascinating theme for writers Timmaya has also faced the same problem that Telagana

encountered. How should he put in the sanskritized proper nouns? Should they also be Telugized? Some of the followers of Telagana did it, making the work unintelligible to readers. But no, like Telagana he did not like it. He accepted them as they were. The aim of Timmaya as well has been to make his work intelligible to readers and he did it admirably.

No research work worth the name is hither to made as this genre of Telugu literature. Our friend, Dr. K.V. Sundaracharyulu, did not want to follow the beaten track He decided to tread a new path and unravel the linguistic mysteries of Chaste Telugu works, hitherto left unexplored being prejudiced by the popular misconception that they were nothing but literary gimmicks. He began with Timmaya's 'Ramayana' for his M. Phil degree and then launched as a full length thesis as Chaste Telugu works for his Ph.D. This is our friend Sundaracharyulu, different from others.

He is a great scholar in Telugu and Sanskrit, a good critic and a good teacher, but above all he is a man; he is not the scholar, but the man with scholarship and erudition. That makes him different from others. He has a way of life, a peculiar approach towards problems. I wish him long life and hope he would pen some more works with his individualistic imprint on them.

Secunderabad,
April 29, 1993

—K. CHAKRAPANI

# పీఠిక

సాహిత్యం ఒక కళ. వైవిధ్యం కళకు ప్రాణం. గతానుగతికంగా ఒకే ముద్రలో నడవడం ప్రతిభావంతుడైన కళాకారుడికి నచ్చదు. తనదైన ఒక ప్రత్యేకతను కనబరచకపోతే సార్థక్యం లేదు. ఇతివృత్తంలో, రస నిర్వహణంలో శైలిలో ప్రతిభావంతుడైన ప్రతి కవీ ఒక కొత్తబాట వేయడానికి ప్రయత్నిస్తాడు పదిమంది నడిచిన తోవలో తాను నడవడం కాక తానే ఒక బాటవేసి, ఆ బాటలో పదిమందీ నడవాలని వాంఛిస్తాడు. నూతనత్వం కోసం ఈ అన్వేషణే సాహిత్య కళా రంగంలో అనేక నూత్న ప్రయోగాలకు దారి తీసింది. ఈ ప్రయోగాలు కేవలం ప్రయోగాలకోసం కాక మానవ జీవన తత్వాన్వేషణలో పథనిరూపణదిశలో సాగినప్పుడు మహోదాత్తకళాసృష్టి జరుగుతుంది.

ఇటువంటి ఉదాత్త తత్వాన్వేషణ దృష్టి అరుదుగా మాత్రమే సాధ్యమౌతుంది. బాటవేసే వారిసంఖ్య ఎప్పుడూ పరిమితమే. ఆ బాటలో నడిచే వారి సంఖ్య ఎప్పుడూ అపరిమితమే. అయితే రాచబాటలతోపాటు మరెన్నో పిల్ల బాటలుకూడా ఉంటాయి. వాటి అవసరమూ ఉంటుంది. అభివ్యక్తి రూపం విషయంలో చేసే ప్రయోగాలు ఈ పిల్లబాటలవంటివి. సమాజజీవన విధానంలో గాని వ్యక్తి తాత్వికోద్ధారణలోగాని అభివ్యక్తి రూపం తీసుకురాగలిగిన ఉన్నతి ఏమీలేదు. అది కేవలం చమత్కార కారకం మాత్రమే.

అభివ్యక్తి రూపంలో భాషా సంబంధి ప్రయోగం అచ్చ తెలుగు. కష్ట సాధ్యమైన అభివ్యక్తి పద్ధతి నెన్నుకుని పాఠకుల కళ్ళకు మిరుమిట్లు గొల్పడమే ఈ విధమైన ప్రయోగానికి ప్రయోజనం. పొన్నిగంటి తెలగన ప్రారంభించిన ఈ అచ్చ తెలుగు ప్రక్రియలో పలువురు రచనలు చేశారు. వారిలో చాలా ముఖ్యమైన కవి కూచిమంచి తిమ్మకవి. భాషాప్రయోగంతో ఉదాత్త ఇతివృత్త సమ్మేళనం తిమ్మకవి విశిష్టత. అచ్చ తెలుగులో రామాయణ రచన చేసి చరితార్థుడయ్యాడు.

తెలుగు భాషా సాహిత్య పరిశోధనారంగంలోకూడా ఇటువంటి నూతన సత్యాన్వేషణ, తెలుగంటే ఎంతో మక్కువ డా॥ కె. వి. సుందరాచార్యులు గారిని అచ్చ తెలుగు కావ్యాల వైపు నడిపించింది. తొలి ప్రయత్నంగా ఆయన ఈ పరిశోధనకు అచ్చతెలుగు రామాయణాన్ని ఎన్నుకున్నాడు. అచ్చ తెలుగు మీది ఆదరభావమూ, కళ్యాణ రాముని మీది భక్తి అయనకు మార్గదర్శకాలయ్యాయి. ఈ రెండూ ఒకచోట కూడిన అచ్చతెలుగు రామాయణం ఆయనను ఆకట్టుకుంది.

సంస్కృత సాహిత్యంలోని అద్వితీయ రమణీయమైన రామాయణ మహాకావ్యాన్ని ఎందరో తెలుగులోకి అనువదించారు. సంస్కృత పద బహుళమైన శైలిలో పూర్వ రామాయణానువాదాలు వచ్చాయి. అచ్చతెలుగులో అనువాదానికి పూనుకోవడంవల్ల తిమ్మకవి ఎదుర్కొనవలసి వచ్చిన సమస్యలను చర్చించడమే ఈ సిద్ధాంత వ్యాసం ప్రధానోద్దేశం. అంటే అనువాదంలో సాహిత్యపరమైన సమస్యలను చర్చించడం కాని, కూచిమంచి తిమ్మకవి శైలీ సౌందర్యాన్ని వింగడించడంగాని ఈ వ్యాసంలో ప్రధానం కాదు. కూచిమంచి తిమ్మకవి ఉపయోగించిన అచ్చతెలుగును విశ్లేషించడమే లక్ష్యం.

సుందరాచార్యులుగారు అటు సంస్కృత వ్యాకరణాన్ని ఇటు తెలుగు వ్యాకరణాన్నీ బాగా అధ్యయనం చేసినవారు. ప్రాచీన వ్యాకరణ సంప్రదాయాలను చక్కగా తెలిసి ఉండడంతోపాటు ఆధునిక వ్యాకరణ సంప్రదాయాలపట్ల వైముఖ్యం లేకపోవడమే గాక ఆదరం కూడా ఉన్నవారు. ఈ సిద్ధాంత వ్యాసంలో వారి ఈ దృక్పథం విశదంగా వెల్లడవుతున్నది.

సుందరాచార్యులు గారు సౌమ్యులు, సహృదయులు, లోకవృత్త మెరిగినవారు. తమ అభిప్రాయాలను సూటిగా స్పష్టంగా అభివ్యక్తం చేస్తారు. ఏ విషయంలోనూ అభిమాన దురభిమానాలకు లోనుగారు ఖండన మండనాలకు దూరులు. అందుకే ఆయన రచనలో తన మతాన్ని తెలియపరచడమే తప్ప విమర్శ ప్రతివిమర్శలకు తావుండదు. తానొవ్వరు, ఇతరులను నొప్పించరు. ఆయన రచన కూడా అంతే.

ఆయన ఈ అచ్చ తెలుగు రామాయణ భాషా పరిశీలనతో ఆగక తెలుగులో ఇంతవరకు వచ్చిన అచ్చతెనుగు రచనలన్నింటిని గురించి విపులమైన పరిశోధన చేసి పిహెచ్ డి పట్టాన్నందుకున్నారు. అది గ్రంథరూపంలో ఇంతకుముందే ప్రచురితమై విమర్శకుల అభినందనలను అందుకున్నది. అచ్చ తెలుగు స్వరూప స్వభావాలనూ, అచ్చతెలుగు రామాయణం సొబగులనూ, సరళంగానూ, సమగ్రంగానూ విశ్లేషించిన ఈ గ్రంథం అటు విమర్శకులనూ, ఇటు సామాన్య పాఠకులనూ కూడా అలరిస్తుందనడంలో సందేహంలేదు. ఇంత మంచి పుస్తకాన్నందించినందుకు సుందరాచార్యులుగారు అభినందనీయులు. త్వరలోనే మరో ఉత్తమ గ్రంథాన్ని సహృదయ పాఠకలోకానికి అందిస్తారని ఆశిస్తాను.

**డా॥ డి. చంద్రశేఖర రెడ్డి**

# విషయసూచిక

# 1. తిమ్మకవి జీవితం–కృతులు

కూచిమంచి తిమ్మకవి అనంతర ప్రబంధ యుగ కవులలో పేర్కొన దగినవాడు. కావ్యావతారికలలో తెలుగు కవులు తమను గూర్చి తమ కావ్య కర్తలను గూర్చి అనేక వివరా లందిస్తారు. అయినా ఎంతోమంది కవులను గురించి అనేక వాదవివాదాలుత్పన్నమౌతున్నాయి. కూచిమంచి తిమ్మకవి తన రచనలలో సందేహానికి తావులేని వివరాలనెన్నింటినో అందించాడు.

**వంశము :**

ఆరువేలనియోగి, కౌండిన్య గోత్రుడు,[1] ప్రపితామహుడు బయ్యన, పితామహుడు తిమ్మన, తండ్రి గంగన, జగ్గన, సింగన, నరసన్న పినతండ్రులు, జగ్గన, సూరన తమ్ములు, వీరమ్మ, పాపమ్మ మేనత్తలు, లక్ష్మి తల్లి.[2] మరో తమ్ముడు సింగన,[3] భార్య బుచ్చమ.[4] జగ్గకవి కుమారులు తిమ్మన, సింగన.[5]



తిమ్మకవి తన తాత తిమ్మన 'నిరతాన్నదానవర్ధిత యశస్సాంద్రుడ'నీ, తండ్రి కూచిమంచన్వయాంబోధి నీహారకరుడనీ చెప్పుకున్నాడు. తనను గురించి కదుప్రౌఢనసీ, జగద్వినుత యశుడనసీ, శ్రీమదుమారమణ కరుణా కటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరస కవితా సామ్రాజ్య దురంధర ఘన యశోబంధు రుడనసీ చెప్పుకున్నాడు. పిఠాపుర రావు నీలాద్రి మాధవరాయ నృపతి తిమ్మ కవికి 'కవి సార్వభౌమ' బిరుదాన్ని ఇచ్చాడు.[6]

## గురువు :

దెందులూరి లింగనారాధ్యుడు కూచిమంచి తిమ్మకవి గురువు. "వలు పుట్టువులఁగూర్చిన దోసంబుల్ చిదుమంగా వేడుక పెల్లిద మొదవెడు దెందు లూరి లింగయ గురునిన్"[7] ఎద కుదురగు భక్తితో కొలుస్తానన్నాడు.

"చిరభక్తిన్ బొగెడద, మ
ద్గురునాథుని, దెందులూరి కులపావనునిన్
గరుణానిధి, నపరాంతక
హరమూర్తిని, ఘనుని, లింగనారాధ్యమణిన్"[8] అని లక్షణ సారసంగ్రహంలో లింగనారాధ్యుని స్తుతించాడు. అచ్చ తెలుఁగు రామాయణములో-

ఏమేటి యడుగుఁగెందామర బల్గాఁపు
రపుటేల్ల జేని క్రబంపుఁదెప్ప
యే బల్లిదుఁడు చెవినిడు నక్కరములు చె
ల్వాపు ముత్తిమేడకు వరుసమెట్లు
తే పున్నెములగని యెఱిఁగించు మేత్రెల్వి
కల్ల జగంబు చీఁకటికి దివ్వె
యేదంట యొసఁగునున్పాది దోసపుఁదుల్వ
గాడ్పుదిండులకు వాకట్టుమందు
తనర నే పెద్ద పుట్టువులను కడింది
తెవులునకు వెజ్జు జేఁడట్టి దెందులూరి
కొలఁపు పాలేటి నిండు జాబిలి యనంగఁ
దనరు లింగన గురుని డెందమునఁదలఁతు[9] అని వర్ణించాడు.

## కాలం :

కూచిమంచి తిమ్మకవి తన 'రుక్మిణీ పరిణయము'లో రచనా కాలాన్ని తెల్పుకున్నాడు. శాలివాహన శకాబ్దములు 1637 మన్మథ సంవత్సరంలో ఈ కృతి పూర్తయింది.[10] లక్షణసార సంగ్రహం

శాలివాహన శకవర్ష సంఖ్య కరర
సాంగ శశి సంజ్ఞనలరు రౌద్ర్యబ్దమునను
భాద్రపద శుక్ల పంచమి వరకుఁ బూర్ణ
మయ్యెనీకృతి నీ పేర నగసుతేశ![11]

శా. శ. 1662 రౌద్రనామ సంవత్సరంలో పూర్తయింది. రుక్మిణీ పరిణయము క్రీ. శ. 1715 లోనూ, లక్షణ సారసంగ్రహం 1740 లోనూ పూర్తయ్యాయి. రసికజన మనోభిరామము క్రీ. శ. 1750 లో పూర్తయింది.[12] శివలీలా విలాసము శా. శ. 1668 ధాత సంవత్సరంలో పూర్తయింది.[13] అంటే క్రీ. శ. 1757.

తిమ్మకవి రచనలలో రుక్మిణీ పరిణయాన్ని తొలిరచనగానూ, శివలీలా విలాసాన్ని తుది రచనలలో నొకటిగానూ భావించవచ్చు. ఆయన రచనా వ్యాసంగం నలభై రెండేళ్ళకు పైగా సాగింది. పాతికేళ్ళ వయస్సులో తిమ్మకవి తొలి రచన చేశాడనుకుంటే ఆయన జననం క్రీ. శ. 1690 ప్రాంతాల జరిగి ఉంటుంది. నిరంతర సాహిత్య వ్యాసంగంలో ఉన్న ఈ కవి శివలీలా విలాసం తర్వాత పేర్కొన్న రచనలేవీ లేకపోవడం వల్ల తర్వాత కొంతకాలమే జీవించి ఉండి ఉంటాడనుకోవచ్చు. శివలీలా విలాసరచన . శ. 1757 కాబట్టి ఆయన క్రీ. శ. 1760 వరకు జీవించి ఉండవచ్చు. । . శ. 1690-1760 మధ్య కాలంలో జీవించి, తిమ్మకవి ఆంధ్ర సారస్వతాని ఖండ సేవ గావించాడు.

## ప్రాంతం :

లక్షణసార సంగ్రహంలో 'కందరాడ పుర సంస్థితుఁడ'నని చెప్పుకొన్నాడు. తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురం సమీపంలోని గ్రామం ఇది. తిమ్మకవి ఈ గ్రామానికి కరణం. తిమ్మకవి పిఠాపురంలోని కుక్కుటేశ్వర

స్వామికి తన గ్రంథాలను అంకితం ఇవ్వడమూ, పిఠాపురం మీద వల్లమాలిన అభిమానాన్ని చూపించడమూ ఆయన పీఠాపురంలోనే నివాస మేర్పరచుకొని ఉంటాడనే ఊహకు కారణమవుతున్నది. తొలి రచన అయిన రుక్మిణీ పరిణయంలోనే-

'పాదగయా క్షేత్ర పరమ పవిత్రంబు
  పురుహూతి కాంబకుఁ బుట్టినిల్లు
యేలానదీ జలావృతతటాకానీక
  మఖిల శక్తులకు విహారభూమి
తోరంపు లవణ పాథోనిధి తీరంబు
  నిర్మల గౌతమీనికట సీమ
కుంతి మాధవదేవు గురుతర స్థానంబు
  విలసిత భీమమండల తలంబు

సేతు కాశీ ప్రయాగాద్య శేషదివ్య
తీర్థ రాజంబులందు ప్రతిష్ఠఁగాంచి
సకల దోషాపనోదక శక్తినలరు
పుణ్య సారంబు పీఠికాపుర వరంబు' అనీ,

చక్రవాళా హార్య జలధి తుల్యోన్నత
  ప్రాకార పరిఖా విరాజితంబు
సాంద్రముక్తా సౌధ చంద్రశాలానేక
  శర్మ నిర్మిత హర్మ్య శర్మదంబు
కరిసైంధవాందోళికాధేను ధన ధాన్య
  వన దేవ గృహ సరోవర్ధితంబు
విమల చాతుర్వర్ణ్య విద్వత్కవి శ్రేష్ఠ
  ఘటనటామాత్యవిస్ఫారితంబు

రాజ మహేంద్రవరదుర్గ రాజ్యభూరి
భార సంభరణాక్రాంత భాసమాన
రావు మాధవ నృప పరిరక్షితంబు
భోగనికరంబు పీఠికాపుర వరంబు[14]

## భక్తితత్పరత :

కూచిమంచి తిమ్మకవి రాజాదరణ కంటె పరమేశ్వరాదరణపై నమ్మకం కలిగినవాడు. దెందులూరి లింగనారాధ్యుని శిష్యుడు. 'ఘన దెందులూరి లింగన గురూత్తమ దత్త సార శైవాచార సం|గహుండను' అని చెప్పుకొన్నాడు. తన రచనలలో 'సర్పపుర మాహాత్మ్యము' తప్ప తక్కిన వాటినన్నింటిని పీఠాపుర కుక్కుటేశ్వరస్వామికే అంకితం ఇచ్చాడు. తన గ్రంథాలలో శివస్తుతి, విఘ్నేశ్వర స్తుతిచేసి శివభక్తిని ప్రకటించుకొన్నాడు. తను 'శ్రీమదుమార మణ కరుణా కటాక్ష నిరీక్షణ సంలబ్ధ సరస కవితా సామ్రాజ్య దురంధరుడ'నని కూడా చెప్పుకున్నాడు. అయినా శివుని తప్ప అన్యుని గొలువనివాడుకాడు. సర్పపుర మాహాత్మ్యాన్ని పీఠాపుర సమీపంలోని భావనారాయణస్వామికి అంకితం ఇచ్చాడు. రుక్మిణీ పరిణయ, సింహాచల మాహాత్మ్య, నీలాసుందరీ పరిణయాదులు విష్ణుగాథలు. శివ, విష్ణు పరమైన గాథలను రచించడంవల్ల శివకేశవాద్వైత బుద్ధి ఈ కవిలో ఉందనవచ్చు.

గ్రంథాలను నరాంకితం చేయని కవులలో తిమ్మకవి ప్రముఖుడు. కుక్కుటేశ్వర శతకంలో నృపకులాధములను దూషించాడు. 'రాజులకు కావ్యం అంకితమిస్తే వారు మోక్షాన్నివ్వగలరా? ఏనుగులు, గుఱ్ఱాలు, భూషణాంబరాలతో తృప్తిపరపగలరా?' అనీ, 'రాజులు ద్విజపుంగవులకు ప్రవేశింపరాని పృదుగృహాంతరములలో ప్రేమతో నుందురనియు, ధర్మపద్ధతులు తెలియక ధరణిపై నడువ పాదము లేకుందురనియు, దుర్మార్గులగు మంత్రులు చెప్పినట్లు నటించుచు ద్విజిహ్వకలు గలిగియుందురనియు, వక్రగతులచే వర్తించు వారనియు, ఎప్పుడును బుస్సురనుచు విషానలమును వెలి గ్రక్కుదురనియు, మదాంధులై యుందురనియు, అట్టి వారిని తుచ్ఛభోగములకై పొగడుటంతయు ఇహపరములను దూరము చేసికొనుటయే యనియు' తిమ్మకవి దూషించాడు.[15]

'నరవరులిడు మణిభూష కరితురగాందోళికాది విభవములు స్థిరములు గావు. ఇహపరముల నిచ్చెదను - కృతి యిమ్మ' అని కుక్కుటేశ్వరస్వామి తనను కోరినట్లు రసికజనాభిరామములో చెప్పుకొన్నాడు.[16]

## సమకాలికులు :

'చంద్రరేఖా విలాపము' రచించిన కూచిమంచి జగ్గకవి తిమ్మకవి సోదరుడే. 'వాసవదత్త పరిణయ' కావ్యకర్త వక్కలంక వీరభద్రకవి, 'ధర్మఖండ' కర్త భవానీ శంకరకవి, భర్తృహరి సుభాషితాలను తెలుగులోకి అనువదించిన ఏనుగు లక్ష్మణకవి తిమ్మకవి సమకాలికులే. వీరు తిమ్మకవికి ఆప్తులు.

## రచనలు :

1. రుక్మిణీ పరిణయము
2. రాజశేఖర విలాసము
3. కృష్ణ దండకము
4. చిరవిభవ శతకము
5. సింహాచల మాహాత్మ్యము
6. నీలాసుందరీ పరిణయము
7. అచ్చతెలుగు రామాయణము
8. సారంగధర చరిత్రము
9. భర్గ శతకము
10. సాగరసంగ మాహాత్మ్యము
11. లక్షణసార సంగ్రహము
12. రసికజన మనోభిరామము
13. సర్పపుర మాహాత్మ్యము
14. కుక్కుటేశ్వర శతకము
15. సుజన మనః కుముదచంద్రిక
16. భల్లాణ చరిత్రము
17. శివలీలా విలాసము

రెండు మూడు తప్ప కూచిమంచి తిమ్మకవి రచనలన్నీ ముద్రితాలే.

## చాటువులు :

ఏనుగు లక్ష్మణ కవి తిమ్మకవిని ప్రశంసించినట్లు ఒక చాటువున్నది. రసికజన మనోభిరామ రచనానంతరం ఆకృతి చదివిన వార వనిత ఒకామె తిమ్మకవిని కౌగిలించుకొనగా ఆయన పెదమొగం పెట్టాడట. అప్పుడామె

'చతురులలోన నీవు గడు జాణ వటంచును నేను గౌఁగిలిం
చితి నిటు మాఱుమోమిడఁగఁజెల్లునె యోరసికాగ్రగణ్య!

అని ప్రశ్నించిందట. దానికి తిమ్మకవి-

'అద్భుతమగు నట్టి బంగరపు బొంగరపుంగవఁబోలు నీ కుచ
ద్వితయము బొమ్మునాటి యల వీఁపున దూసెనటంచుఁజూచితిన్'

అని జవాబిచ్చారట.

## పండిత్యం :

లక్షణ సార సంగ్రహంలో 'సకల సంస్కృతాంధ్ర లక్షణ కళా కౌశలాభిరాము'దనని చెప్పుకున్నాడు. అభినవ వాగనుశాసనుడననీ చెప్పుకొన్నాడు.

## చివరి రోజులు :

ఆయన చివరి రోజులలో స్వగ్రామం వదలి వరాయిచోట వుండవలసి వచ్చింది. అది బొబ్బిలి యుద్ధం జరుగుతున్న కాలం. కళింగసీమ అంతా అల్లకల్లోలంగావుంది. సంస్థానాధీశుల సేనలు, మరాఠీల దండులు, ఫ్రెంచివాళ్ళ వటాలాలూ అదే పనిగా అటూ ఇటూ తిరుగుతున్న రోజులవి. కందరాడకి సేనల తాకిడి చాలావుంది. అది తట్టుకోలేక స్వగ్రామాన్ని వదిలి తిమ్మయ్య చంద్రమ్మపాలెం అనే ఊరు చేరుకున్నాడు. అతనికి పిల్లలు లేరు. తమ్ముడు జగ్గన్న, అతని కొడుకులూ తప్ప ఆదుకునేవాళ్ళు లేరు. భార్య పోయింది. ఈ అనుభవాన్ని తిమ్మయ్య ఇలా చెప్పుకున్నాడు :

అన్నంబు నాలుక కరుచియై కనుపట్టు
నిలచినచో నిల్వ నలవిగాదు
మనుజేంద్రుతోనైన మాటాడ సైపదు
పనుల యందేమియు మనసు లేదు
నడుచుచో నడుగులు తడబాటు గైకొను
దగ బంధువులనైన నగవురాదు
తెవులు పుట్టిన రీతి దేహంబు కృశియించు
గలనైన నిద్దుర కలుగబోదు

శివ శివా ధాత్రి దావలచిన వధూటి
బాయు వెత వద్దు సుమ్మెట్టి పలువకైన
భూనుత విలాస పీఠికాపుర నివాస
కుముదహిత కోటి సంకాశ కుక్కుటేశ! (నెం. 92)

"ఇదే శతకంలోని చివరి పద్యం. బహుశ తిమ్మయ్య చెప్పిన ఆఖరు పద్యం కావచ్చు. పండుగ రోజులలో కూడా నవ్వురాక, పడుకుంటే కలలో కూడా నిద్దర రాక కృశించిపోతున్న వృద్ధుణ్ణి చూస్తే ఎవరికి సానుభూతి జనించదు? కవిసార్వభౌముడనే బిరుదు ధరించినందుకు తిమ్మయ్యకూడా పాపం శ్రీనాథునిలాగే అవసాన కాలంలో అష్టకష్టాలు పడ్డట్టుంది. శ్రీనాథునికి తమ్ముడు లేడు. ఈయనకు ఉన్నారు. అవసానకాలంలో ఇద్దరికీ ఇంతే లేడా."[17]

# 2. తిమ్మకవినాటి చారిత్రక సాంఘిక పరిస్థితులు

ఏ కవిపై నయినా ఆనాటి రాజకీయ, సాంఘిక, ఆర్థిక పరిస్థితులు ప్రభావం చూపుతాయి. "కూచిమంచి తిమ్మయ్య తన 56 సంవత్సరాల సాహిత్య జీవితంలో 15 కావ్యాలు వ్రాశాడు. వీటిలో ఒకటి లక్షణ గ్రంథం, ఒకటి ద్విపద కావ్యం, ఒకటి దండకం, మూడు శతకాలు, తొమ్మిది పద్య కావ్యాలు ఉన్నాయి. ఈ పద్య కావ్యాలలో రెండు పూర్తిగా అచ్చు తెనుగువి."[1] ఇలా వివిధ ప్రక్రియలను ఆయన చేపట్టటానికి కారణమేమిటి? ఆనాటి చారిత్రక సాంఘిక పరిస్థితులేమైనా దోహదం చేశాయేమో పరిశీలిద్దాం.

కూచిమంచి తిమ్మకవి 'కడపటి రాజుల యుగం'[2] నాటివాడు. 'ఈ యుగం క్రీ.శ. 1674 లో ప్రారంభమవుతుంది.'[3] తిమ్మకవి జన్మించిన 'ప్రోలునాడు' గోల్కొండ రాజ్యంలో ఉండేది. 'ఆనాడు గోల్కొండ రాజ్యంలో తెలంగాణం, కర్నాటకం, ఆర్కాటు అనే మూడు ఖండాలు వుండేవి. ఈ మూడింటిలోను 58 సర్కారులు, 654 పరగణాలు ఉండేవి'[4] అప్పుడు పింగళి మాదన్న గోల్కొండ ప్రభువైన తానీషా దగ్గర మీర్‌జుమ్లా (ఆర్థిక వ్యవహారాల సర్వాధికారి)గాను, ఆయన సోదరుడు అక్కన్న పేష్కర్ పదవిలోనూ ఉండేవాళ్ళు. క్రీ.శ. 1674 లో శివాజీ 'మహారాజ' బిరుదంతో రాయగడదుర్గంలో పట్టాభిషిక్తుడయిన తర్వాత, మాదన్న శివాజీతో తానీషాకు మైత్రి కుదిర్చాడు. శివాజీ హైదరాబాదు వచ్చి ఆతిథ్యం స్వీకరించాడు. ఒక సంధి పత్రంపైన కూడ సంతకం చేశాడు. ఇలా ఈ రెండు ప్రభుత్వాలు దక్షిణాపథంలో సుస్థిరం అయాయి. క్రీ.శ. 1674 లోనే తర్వాత ఆంధ్రదేశ చరిత్రను మార్చివేసిన ఫ్రెంచివాళ్ళు చెంజి దుర్గాధిపతి షేర్‌ఖాన్ వద్ద పుదుచ్చేరి రేవును కొనుక్కున్నారు.[5]

అయితే ఔరంగజేబుకు ఇలా దక్షిణాదిని ఇద్దరు బలవంతులు వేళ్ళు నిలదొక్కుకొనటం సహింపరానిదయింది. క్రీ.శ. 1680 లో శివాజీ చనిపోవటంతో ఆయన తన పథకం ప్రవేశపెట్ట ప్రారంభించాడు. క్రీ.శ. 1681 లో దక్షిణాపథానికి సేనలను పంపాడు. క్రీ.శ. 1686 లో విద్రోహులకు లంచం ఇచ్చి అక్కన్న మాదన్నలను హత్య చేయించాడు, గోల్కొండను కబళించాడు. మొత్తం దక్షిణాదినంతా జయించి, మొగలు ప్రతినిధిగా ఒక సుబేదారును దక్కనులో నిలిపాడు. దక్కనుకు మొదటి సుబేదారు కమ్రుద్దీన్‌ఖాన్. అతణ్ణి 'నవాబ్ మీర్ కమ్రుద్దీన్‌ఖాన్ - బిన్ కలీజ్‌ఖాన్ పతహాజంగు నిజాముల్ ముల్క్ అసఫ్‌జా' అంటారు. అలా హైదరాబాదు నవాబులకు 'నిజాం' అనే బిరుదూ 'అసఫ్‌జా' అనే వంశనామం స్థిరపడ్డాయి.[6]

మొదటి నిజాం కాలంలోనే కోస్తా పట్టణాలలో తెల్లవాళ్ళు - డచ్, ఫ్రెంచ్, ఇంగ్లీషువాళ్ళు - గిడ్డంగులు కట్టుకున్నారు. మెల్ల మెల్లగా వాళ్ళు దేశ రాజకీయాల్లో వేలు పెట్టటం ప్రారంభించారు. మొదటి నిజాం మరణించాక అతని రెండో కొడుకూ, కూతురి కొడుకూ వారసత్వంకోసం కొట్లాడుకున్న సందర్భంలో ఫ్రెంచివాళ్ళు కలగజేసుకున్నారు. అయితే ఈ వారసు లిద్దరూ యుద్ధభూమిలో హతమయ్యాక, సలాబత్‌జంగ్ అనే మరో వారసుణ్ణి ఫ్రెంచి వాళ్ళు నిజాముగా నిలిపారు. మొదట్లో ఫ్రెంచివాళ్ళూ, ఆ తర్వాత ఇంగ్లీషు వాళ్ళూ సలాబత్‌జంగ్‌కు రక్షణ ఇచ్చారు. ఇంగ్లీషువాళ్ళు చేసిన సాయానికి ప్రతిఫలంగా 1759 మే నెలలో ఎనిమిది పరగణాలతో మచిలీపట్నం వాళ్ళకు ఈనాంగా ఇచ్చాడు. ఆ తర్వాత అతని తమ్ముడు నిజాం అలీ 1761 లో అన్నను బంధించి తనే సుబేదారుగా ప్రకటించుకున్నాడు ఇంగ్లీషు వాళ్ళని తనకు సైనిక సహాయం చేయమని కోరాడు. ఖర్చుల నిమిత్తం శ్రీకాకుళం, రాజమండ్రి, ఏలూరు, కొండపల్లి సర్కారులు నాలుగూ ఇచ్చాడు.[7]

అలా తిమ్మకవి నివసించిన 'ప్రోలునాడు' కుతుబ్ షాహీలు, నిజాంలు, ఫ్రెంచివాళ్ళు, ఆ తర్వాత ఇంగ్లీషు వాళ్ళ పాలనలోకి వచ్చింది. ఈ 'ప్రోలునాడు' (పొర్లునాడు) లో పెద్దాపురం, కాకినాద, పిఠాపురం, తుని ప్రాంతాలు వుండేవి. ఈ సీమలో పెద్దాపురం, పిఠాపురం సంస్థానాలు చరిత్ర కల రాజ్యాలు. ఆ రెండు సంస్థానాలు చాల సఖ్యంగా వుండేవి. కూచిమంచి

తిమ్మకవి జన్మించిన 'కందరాడ' పిఠాపురం సంస్థానం చేరువలో వున్న గ్రామం. పిఠాపురం సంస్థానాన్ని 1647 నుండి 1671 దాకా రామచంద్ర రాయణిగారు, ఆ తర్వాత 1671 నుండి 1704 వరకు పెద మాధవ రాయణిం గారు పరిపాలించారు. పెద మాధవరాయణింగారి తమ్ముడు నరసింహరాయణిం వారు 1704 నుండి 1720 వరకూ పరిపాలించాడు. ఆయన కొడుకు వెంకట రాయణిగారు 1720 నుండి 1728 వరకు పరిపాలించాడు. ఈయన అపుత్రకు డవడం వల్ల ఆయన చిన ముత్తాత గారి మనుమడు బుచ్చారాయణిగారు రాజ్యా నికి వచ్చి 1728 నుండి 1759 వరకూ పరిపాలించాడు. ఆ తరువాత చిన మాధవరాయణింగారు 1759 నుండి 1761 వరకూ పరిపాలించాడు.[8]

పెద్దాపురం, పిఠాపురం సంస్థానాలు చేసిన సాహిత్య సేవ అనల్పం. ఎందరో కవులను పోషించి, ఎన్నో కృతులు నిర్మింప చేసిన ఘనత ఈ రాజ్యా లకు దక్కింది.

"కడపటి రాజుల యుగంలో ప్రజల కడగండ్లకు అంతులేదు. ఎక్కడ చూసినా యుద్ధాలే. సైనికులు ఊళ్ళను కొల్లగొట్టటం సామాన్యమైపోయింది. పన్నులు వసూలు చేయటమే తప్పించి ప్రజలకు సౌకర్యాలు సమకూర్చట మన్నదే అబ్బురమైంది. పాతకాలపు వనరులు పాడైపోతూ వుంటే పాలకులు చూస్తూ ఊరుకొన్నారు గానీ తమ సంచులు విప్పి మరమ్మత్తు చేయించడంలేదు. వ్యవసాయం చేసే రైతును అందరూ పీక్కుతిన్నవాళ్ళే."[9]

18 వ శతాబ్దం భారతదేశ చరిత్రలో చాలా ముఖ్యమైంది. పెద్ద సామ్రా జ్యాలు కూలిపోయాయి. ఉన్న రాజ్యాలు అస్థిరత్వంలో పడి కొట్టుకుంటు న్నాయి. యూరోపియన్ వర్తకుల ముఠాలు త్వరితగతిన అభివృద్ధి చెందాయి. బ్రిటీషు ఈస్టిండియా కంపెనీ బ్రిటీషు ప్రభుత్వం నుండి ఎన్నో అధికారాలను సంపాదించింది. యుద్ధాలు ప్రకటించడానికీ, ఒడంబడికలు చేసుకోవడానికీ, సొంతంగా నాణాలు ముద్రించుకోవడానికీ, న్యాయ విచారణ జరపడానికీ, సొంత సైన్యాన్ని కలిగి ఉండడానికీ కంపెనీ అధికారాలను పొందింది. తమ అవసరాలకు కంపెనీ వనరుల్ని ఉపయోగించుకున్న మొగలు చక్రవర్తులు, బెంగాల్ నవాబులు తదితరులు ప్రతిఫలంగా కంపెనీకి రాయితీ లివ్వవలసి

వచ్చింది. కంపెనీ ఆదాయమూ, అధికారమూ విపరీతంగా పెరగడం ప్రారంభించింది. వలస రాజ్య నిర్మాణం కోసం పోటీ పడ్డ ఫ్రెంచి, ఇంగ్లీషు వాళ్ళలో 18 వ శతాబ్ది మధ్యకాలానికి ఇంగ్లీషు వాళ్ళు విజయం సాధించారు. 1766లో హైదరాబాదు నిజాం గుంటూరు, కొండపీడు, ఏలూరు, రాజమండ్రి, శ్రీకాకుళం పరగణాలను ఇంగ్లీషువారికి కౌలుకిచ్చాడు.

దాదాపు వేయి సంవత్సరాలకు పైగా స్థిరంగా ఉన్న స్వయం సంపూర్ణ ఆర్థిక వ్యవస్థలో 17 వ శతాబ్దంలో మార్పులు రావడం ప్రారంభమయింది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో సమతౌల్యం దెబ్బతిన్నది. యూరోపియన్ వాణిజ్య సంస్థల ప్రవేశం దీన్ని మరింత వేగవంతం చేసింది. అప్పటికి దేశంలోని పట్టణాలే వాణిజ్య కేంద్రాలుగా ఉండగా యూరపియన్ల ప్రవేశంతో విదేశాల్లోని పట్టణాలు కూడా కేంద్రాలయ్యాయి. మొదట్లో మనదగ్గర తయారయిన వస్తువులను తమ దేశంలో అమ్మకొని డబ్బు సంపాదించిన ఇంగ్లీషువాళ్ళు క్రమక్రమంగా ముడిసరుకుల్ని కొని తమ దేశంలో తయారయిన వస్తువుల్ని మన దేశంలో అమ్మడం మొదలుపెట్టడంతో వృత్తికారుల వృత్తులు దెబ్బతిన్నాయి. పెట్టుబడిదారీ సమాజంలోకి అడుగుపెట్టాం. సంబంధాలు ద్రవ్య సంబంధాలుగా మారాయి.

రాజుల, సంస్థానాధిపతుల అధికారం వెనుకపట్టి ఇంగ్లీషు వాళ్ళ అధికారం చెలామణిలోకి రావడం ప్రారంభించింది. తమ అధికారాన్ని కాపాడుకోలేని సంస్థానాధిపతులకు రాజ్యపాలనలో సమయాన్ని వినియోగించే అవకాశం లేకపోయింది. రాజకీయంగా అస్వతంత్రులూ, రక్షణపరంగా అసమర్థులూ, ఆర్థికంగా దివాలా కోరులూ అయి కేవలం బ్రిటీషువారికి పన్నులు వసూలు చేసిపెట్టే సుంకర్ల స్థాయికి చేరుకుంటున్న సంస్థానాధిపతులు ప్రజాక్షేమాన్ని పట్టించుకునే స్థితిలో లేకపోయారు. పన్నుల విషయంలో, అగ్రహారాల విషయంలో, అగ్రవర్ణాల విషయంలో అంతకుముందుండిన రాయితీలు రద్దయ్యాయి. చిల్లర ప్రభువులమీద ప్రజలకు గౌరవాదరాలు లేకుండా పోవడమే గాక నిరాదరమూ, తూష్ణీంభావమూ చోటు చేసుకున్నాయి.

పదుగురు కోతి వెంబడి సంచరింపరే
వాహకుల్లేరె శవంబునకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్
కలిమిగల్గదె వార కామినులకు
పులి గోవు జంపి నక్కల బోషింపదె
స్థూలకాయము లేదె దున్నలకును
పుప్పి పంటికి లేదె పుట్టంబు జుట్టుట
వేణుధరుండెద్దు వెంటరాడె
న్యాయపద్ధతి నడువని యవనిపతికి
నెన్నిచిన్నెలు గలిగిన నెందుకొరకు....

రాజు వేషమాత్రం చేతనే రాజు అవుతున్నాడు తప్ప నిజమైన రాజు కావడం లేదు. రాజులను తిట్టిన కవుల సంఖ్య చాలా ఎక్కువ ఈ కాలంలో. కూచిమంచి తిమ్మకవి-

అందలం బెక్కుట యవని(బ్రశస్తమా
మ్రానెక్కి నిక్కదే మర్కటంబు
తొడవులు దొడుగుట దొడ్డ సౌభాగ్యమా
కడుసొమ్ములూనదే గంగిరెద్దు
విత్తంబు గూర్చుట విమల ప్రచారమా
బహు నిధుల్ గావఁదే భైరవుండు
ప్రజల దండించుట పరమ సంతోషమా
ప్రాణులనెల్ల నేపఁదే జముండు
దొరతనంబున కివిగావు వరుసలరయ
సాహ సౌదార్య ఘన పౌరుషములుగాని....10

అన్నాడు. "ఇట్టి దుర్మదాంధ నృపకులాధము లేరికేమియ్యగలరు?", "తన పొట్టకై ప్రజఁగలఁచు దురితరతుఁడు వాడొక రాజా తరాజు గాక" అని విమర్శించాడు.11

రాజకీయ, ఆర్థిక పరిణామాలవల్ల ఎక్కువగా బాధపడ్డవారు బ్రాహ్మణులు. అందువల్ల బ్రాహ్మణులకు దానధర్మాలు మానివేసిన, మానివేస్తున్న, దానం చేసి బాధపడే వాళ్ళను మూర్ఖులని విమర్శించాడు తిమ్మకవి.[12] అట్లాగే వృత్తులు తారుమారు కావడాన్ని కూడా సహించలేకపోయాడు.

కాపు కవీశ్వరుల్ కంచరు యోగులు
సాతాని వైష్ణవుల్ సాలె భటులు
కోమటి దాతలు కొంటె భాగోతులు
మాలవెజ్జులు బోయమావటీలు
గొల్ల పౌరాణికుల్ పల్లె దైవజ్ఞులు
బానిస వేశ్యలు జైన బాప
లాడు దీర్పరు లుగ్రయవన ధరాధీశ్వ
రులు వైదిక ప్రధానులును మిగుల
భూతలంబునఁ గలి దోష హేతుకమునఁ
బ్రజలు రైరింక నేమి చెప్పంగవలయు....[13]

అని ఈ పరిణామాలకు కలి దోషం కారణంగా ఊహించాడు కవి. నిజంగా రాజరిక వ్యవస్థమీద తిమ్మ కవికి వ్యతిరేకత లేదు. అగ్రహారాలు, ధన కనక వస్తు వాహనాలూ ఇచ్చే మహాప్రభువులుంటే మంచిదే. అటువంటి పరిస్థితులు తొలగిపోయాయి కాబట్టి దాన ధర్మాలు చేయలేని ప్రభువులు పనికి రాకుండా పోయారు. అందుకే వారిని వదిలి సర్వేశ్వరుణ్ణే వరించాడు తిమ్మకవి. మారిన పరిస్థితులకు కారణాలను గుర్తించలేక కలికాలమహిమగా సరిపెట్టుకున్నాడు.

వేద శాస్త్ర పురాణ విద్య లక్కఱ గావు
పరిహాస విద్యలు పనికి వచ్చు
గద్యపద్య విచిత్ర కవితలు కొఱగావు
గొల్ల సుద్దుల కతల్ పెల్లుమీఱు
దేవతాభాషల తీరులేమియుఁ గావు
పారసీకోక్తులు ప్రణుతి కెక్కు

శైవవైష్ణవ మతాచారంబు లొప్పవు
పాషండ మతములు బాళి నలరు
నౌర యిక్కలి కాల మహత్త్వమెంతొ
వింతయై తోఁచుఁగద ధరాభ్యంతరమున....[14]

17, 18 శతాబ్దాలలో ప్రక్రియా వైవిధ్యం ఎంతగానో కనిపిస్తుంది వచన కావ్యాలు, ద్వ్యర్థి, త్ర్యర్థికావ్యాలు, శతకాలు, యక్షగానాలు, దండకాలు, శృంగార ప్రబంధాలు, లక్షణ గ్రంథాలు, అచ్చతెనుగు కావ్యాలు విస్తృతంగా వచ్చాయి. కూచిమంచి తిమ్మకవిలోనూ ఈ ప్రక్రియా బాహుళ్యాన్ని చూడవచ్చు. మహాకావ్య నిర్మాణ క్షమత లేకపోవడమో లేక ఈ పరిణామ దశలో మహాకావ్య రచనకు తగిన మనః స్తిమితమూ, అవకాశమూ లభించక పోవడమో చమత్కారజనకమైన అల్పరచనలకు కవులు పాల్పడడానికి కారణమయి ఉంటుంది.

కవులు ప్రక్రియాపరమైన, భాషాపరమైన చమత్కారాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. క్లిష్టమైన, సర్కస్ ఫీట్లవంటి చిత్రబంధ కవిత్వాలకు వశులయ్యారు. ప్రక్రియా వైవిధ్యంతోపాటు ఈ కాలపు రచనల్లో కనిపించే మరో విశేషం భాషలో వాడుక భాషకు దగ్గరగా రావడం. ఇది యక్షగానాల్లో పాత్రోచితభాషరూపంలోనూ, శతకాల్లో పామర జనాభిప్రాయ వ్యక్తీకరణం గానూ కనిపిస్తుంది. కావ్యభాషకూడా సంభాషణలతో వాడుకభాషకు సమీపంగా వచ్చింది. "గ్రామ్యమనగ నెవరునొప్పరు, ఒరుల దెగడుచోట నొప్పునదియు" అన్న కేతన వాక్యాన్ని అనుసరించి తగిన సందర్భాలలో గ్రామ్యాన్ని కూడా ఉపయోగించారు. ఆత్మాశ్రయ రచనలైన శతకాలలో భాషా విషయంలో శైథిల్యం సహజమే.

ఈ కాలంలో ప్రక్రియా వైవిధ్యం అపారంగా ఉండడానికి కారణాలేమని పరిశీలిస్తే, సలక్షణమైన మహాకావ్యరచన ప్రాచీనుల మార్గంలో చేయడానికి తగిన వాతావరణం లోపించడంవల్ల నూతనత్వ ప్రకటన కోసం అన్వేషణ ప్రారంభించడం ఒక ప్రధాన కారణమనిపిస్తుంది. అందుకే పూర్వులు చేయని పనులు వెతుక్కున్నారు. పూర్వం ద్వ్యర్థికావ్యాలు లేవు కాబట్టి పింగళిసూరన్న

ద్వ్యర్థికావ్య రచనకు పూనుకున్నాడు. రెండర్థాలొచ్చే పద్యాలు మాత్రం పూర్వ కవుల రచనల్లో ఎన్నో దొరుకుతాయి. వాటిని అదర్శంగా తీసుకుని ఇక్కడ సంపూర్ణ కావ్యరచనను తలపెట్టారు. అట్లాగే పూర్వుల రచనల్లో అక్కడక్కడా అచ్చతెనుగు పద్యాలూ, నిరోష్ఠ్యపద్యాలూ, అనులోమ విలోమ పద్యాలూ, ఏకాక్షర పద్యాలూ ఉండనే ఉన్నాయి. కావ్యమంతా ఇటువంటి నియమాన్ని పాటించడం నూతనత్వం నిర్వచనంగా రాయడమే ఒక విశిష్టలక్షణంగా భావించిన వారికి ఇవన్నీ ఆకర్షక లక్షణాలే. ఒక నియమాన్ని అవలంబించడమే మహత్కార్యంగా భావించిన కవులు క్రమక్రమంగా అనేక నియమాలతో కావ్య రచన చేయడం మహోత్కృష్టంగా భావించడం జరిగింది. ఈ ప్రయోగ వైచిత్రీ కుతూహలమే, నూత్న ప్రియత్వమే అచ్చతెనుగు కావ్యాలు ప్రభవించ డానికి కారణమయింది.

# 3. అచ్చ తెలుగు

‘అచ్చ తెనుగు’ అన్న మాటను తొలుత వాడినవాడు మూలఘటిక కేతన. అంతకు ముందు ‘జాను తెలుగు’, ‘దేశి’ అనే మాటలు నన్నెచోడుడు, పాల్కురికి సోమన వాడారు. అయితే ఈ మాటలు భాషా పరంగా గొప్ప విశేషాలను తెలిపేవి కావు. ఎందుకంటే జాను తెలుగులో రచన చేస్తామన్న ఈ కవులు వాడిన భాష నన్నయ తిక్కనాదుల భాషకంటే భిన్నమైనది కాదు. కాని వృషాధిప శతకంలో జాను తెలుగుకు పాల్కురికి సోమన ఉదాహరణం అతని కావ్య భాషకంటే భిన్నమైనది. అందువల్ల జాను తెలుగు ఏమిటో స్పష్టం కాదు.

కేతన తెలుగు భాషలోని పదజాలాన్ని తత్సమం, తద్భవం, అచ్చ తెనుగు, దేశ్యం, గ్రామ్యం అని అయిదు విధాలుగా వర్గీకరించాడు. కేతన ఉదాహరణంనుబట్టి పరిశీలిస్తే అచ్చ తెలుగుకూ, దేశ్యానికీ కూడా భేదం స్పష్టపడదు. పైగా తత్సమం తప్ప తక్కిన నాలుగూ ‘అచ్చ తెలుగు’ అని చెప్పడంవల్ల ఇది మరింత క్లిష్టమవుతుంది.[1] నాలిగింటిలో ఒక విభాగానికీ, నాలిగింటికీ కలిపి ఒకే సంకేతం సందిగ్ధతను కలిగిస్తుంది. అందరికీ తెలిసే దేశ్యపదాలు అచ్చ తెలుగు అనీ, తక్కినవి కేవలం దేశ్యమాతలనీ కేతన భావించి ఉండవచ్చు.

విన్నకోట పెద్దన కూడా తెలుగు పదజాలాన్ని ఐదు విధాలుగా విభజించాడు. తత్సమం, తద్భవం, సహజాంధ్ర దేశభవం, దేశ్యోద్భవం, గ్రామ్యం. ఇక్కడ దేశ్యోద్భవం అన్యదేశ్యం. సహజాంధ్ర దేశభవం దేశ్యం, తత్సమ, తద్భవ, దేశ్యాలలో చేరని సహజాంధ్ర దేశభవాలని ఈయన ‘అచ్చ తెలుగు’ అన్నాడు.[2]

ఆంధ్ర శబ్దచింతామణి ‘తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి’ అని పదజాలాన్ని నాలుగు విధాలుగా విభజించింది. దీనిలో అచ్చ తెలుగన్న మాట లేదు. అప్పకవి తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యాలని నాలుగు విధాలుగా విభజిస్తూ ‘ఆంధ్ర దేశ్యంబులు రెండు దెలుంగులయ్యె శుచి శుద్ధాంధ్రంబులు నన్య దేశ్యతాంధ్రంబులు నాఁగా ....’[3] అని దేశ్య పదాలను రెండు విధాలుగా విభజించాడు.

అచ్చ తెలుగు కావ్యాలు రాసిన కూచిమంచి తిమ్మకవి కూడా తన లక్షణ గ్రంథం 'లక్షణ సార సంగ్రహము'లో తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య విభాగంచేసి దేశ్యాన్నే అచ్చతెనుగు అని కూడా కొందరు అంటారని పేర్కొన్నాడు.[4] తక్కిన వాటికి విస్తృతంగా ఉదాహరణలు చూపిన తిమ్మకవి దీనికి ఉదాహరణలు చూపలేదు. అందరికీ తెలిసిన పదాలు కాబట్టి అక్కర లేదనుకున్నాడేమో!

చిన్నయసూరి బాలవ్యాకరణంలో సంస్కృత సమాసాలు తప్ప తక్కినదంతా అచ్చతెలుగన్నాడు[5]. చిన్నయసూరి విభాగంలో దేశ్యం 'త్రిలింగదేశ వ్యవహారసిద్ధంబగు భాష' అన్నాడు కాబట్టి ఆయన విభాగంలో అన్యదేశ్యాలు కనిపించవు.

తెలుగు లాక్షణికుల పై యభిప్రాయాలను పరిశీలిస్తే తత్సమ తద్భవ విభాగం కేవలం సంస్కృత, ప్రాకృతభాషా పదాలకు సంబంధించిందే తప్ప అన్యభాషా పదాలకు సంబంధించదు. అన్యభాషా పదాలను దేశ్యంలో భాగంగా,-సమానంగా గుర్తించడం విచిత్రంగా ఉంది. ఈ అన్యదేశాలు తక్కిన ద్రావిడ భాషల నుండి గ్రహించినవైతే ఇందులో కొంత ఔచిత్యం ఉంది. అరబిక్, పర్షియన్ పదాలను కూడా గ్రహించడం ఎందుకో? పాలకులైన మహమ్మదీయ ప్రభువులతో తమ ఏకత్వాన్ని తెల్పుకోవడానికా అని ప్రశ్నించుకుంటే ఈ లాక్షణికు లెవరూ వారి పాలనలో ఉన్నవారు కారు.

చిన్నయసూరి నిర్వచనానికి అన్యదేశ్యాన్ని కూడా చేరిస్తే అచ్చతెలుగవుతుంది అచ్చతెలుగు కవుల దృష్టిలో. ఇది ఎంత వరకు సమంజస మన్న ప్రశ్నకు సమాధానం లేదు. లాక్షణికుల దృష్టి, కవుల దృష్టి కూడా ఈ విషయంలో తర్కబద్ధంగా లేదు. మొత్తం భాషలోని పదాలను దేశ్యాలు, అన్యదేశ్యాలుగా విభాగం చేసి అన్యదేశ్యాలలో తత్సమ, తద్భవ విభాగం చేయవలసింది. ఎందుకో లాక్షణికులు ఇటువంటి తర్కసహజమైన ఆలోచనను అనుసరించలేదు. సంస్కృత, ప్రాకృత భిన్నమైన అన్యదేశ్య పదాల సంఖ్య గణనీయం కాదనుకోవడంవల్ల ప్రత్యేక విభాగం చేయలేదేమో!

కవుల విషయానికి వస్తే వాళ్ళు అచ్చతెలుగులో కావ్యరచన చేయడం ఒక క్లిష్టమైన కార్యసాధన. ఈ క్లిష్టత - అపారంగా వచ్చి చేరిన, సహజంగా కలసిపోయిన తత్సమ పదాలను, అవి లేకుండా సామాన్య సంభాషణ కూడా

సాధ్యంకాని స్థాయికి చేరుకున్న తర్వాత కావ్య రచనలో పరిహరించడంలో ఉంది. అందువల్ల సంస్కృత సమాలను పరిహరించి కావ్య రచన చేయడమే వారి ప్రతిభాపాటవానికి గీటురాయి. అల్పసంఖ్యాకమైన పెర్షో - అరబిక్ పదాలకు ఈ విషయంలో ఎటువంటి ప్రాముఖ్యమూ లేదు. వాటిని తద్భవాలతో సమానంగా భావించారు. అన్యదేశ్యాలను పరిహరించకపోవడానికి ఇంత కంటే కారణమేమీ ఉండి ఉండదు. పైగా అచ్చతెలుగు కావ్య రచన ఆరంభం మహమ్మదీయ ప్రభువుల ఆస్థానంలో జరిగింది కాబట్టి కావ్య రచనలో పెర్షో - అరబిక్ పదాల ప్రయోగం వారికి హర్షాన్ని కలిగించి ఉంటుంది. ప్రభువులను ఆనందింపజేయడానికీ, అన్యదేశ్య పదాల ప్రయోగం ద్వారా చమత్కారాన్ని కలిగించడానికీ కూడా ఉపయోగపడింది కాబట్టి పొన్నిగంటి తెలగన్న తన రచనలో వాటిని ప్రయోగించి ఉంటాడు. తరువాతి కవులు గతానుగతికంగా అనుసరించారు.

అచ్చతెనుగులో తనది తొలిరచన అయినా పొన్నికంటి తెలగన్న అచ్చ తెనుగు లక్షణమేమి చెప్పలేదు.

"తెనుఁగునను మాఱుపేళ్ళిడి
పెనఁచిన వినఁగూడ దనుచు బిరుదులుఁజెప్పన్
మును వేల్పుబాస వెంబడి
నునిచెద గాదనకుఁడయ్య యుల్లములందున్"[6]

ఈ ఒక్కమాటే ఆయన చెప్పింది. బిరుదులూ, పేర్లూ మాత్రం సంస్కృత పదాలను యథాతథంగా వాడతానన్నాడు. తక్కిన సంస్కృత పదాలు వాడకపోవడమే నియమమన్నమాట.

"ఒనరఁబేరులు బిరుదులు తెలుఁగు సేయఁ
బోలదని మున్ను పెద్దలుపూని త్రోవ
యిడిరి గావునఁగూరుపుమిదియు నట్లు"[7]

అని తిమ్మకవి కూడా తెలగన మార్గాన్నే అనుసరించాడు. 'నీలా సుందరి పరిణయము'లో ఈ ప్రసక్తికూడా లేదు.

అచ్చతెలుగుకు పర్యాయ పదాలుగా తేటతెలుగు, జానుతెలుగు, నాటు తెలుగు అనేవి కనిపిస్తాయి. జానుతెలుగు పాల్కురికి సోమన వృషాధిపశతక పద్యంలో అచ్చతెలుగే, కాని తక్కినచోట్ల కాదు. ఈ పద నిర్వచనం విషయంలో విస్తృతమైన చర్చ జరిగింది. అందువల్ల అచ్చతెలుగు పర్యాయ పదంగా పని వచ్చేదికాదు. 'తేట తెలుగు' అన్నమాట సాంకేతికంగా 'అచ్చ తెనుగు' అనే అర్థాన్ని ఇచ్చేది కాదు. 'నాటు తెలుగు' అన్న పేరు ఆదిభట్ల నారాయణదా సు పెట్టింది. అంతగా ప్రచారంలోకి రాలేదు.

# 4· అచ్చతెలుగు కవుల అచ్చతెలుగు

అచ్చతెలుగంటే సంస్కృత సమపదాలు తప్ప తెలుగులో వాడే తక్కిన పదాలన్నీ అన్న విషయాన్ని గమనించాం. అచ్చతెలుగు ఒక నూత్న ప్రయోగంగా కవు లారంభించారనీ తెలుసుకున్నాం. ఒక భాష స్వరూప స్వభావాలు ఆ మాట్లాడే ప్రజల సంస్కృతిమీద, ఆ ప్రజలకు ఇతరులతోఉన్న సంబంధాలమీద ఆధారపడి ఉంటాయి. ప్రపంచంలో ఏ జాతి మరో జాతితో ఏ విధమైన సంబంధాలూ లేకుండా ఉండదు. అట్లాగే ప్రపంచంలో ఏ జాతీ శుద్ధం కాదు, స్వచ్ఛంకాదు. అదేవిధంగా ఏ భాషా పరిశుద్ధమూ, ఇటువంటి పరిశుద్ధతా, స్వచ్ఛతాభావాలూ సహజాలు కావు.

మానవ సంఘంలో అనివార్యమైన సంబంధాలను కాదనడం ఆయా వర్గాల రాజకీయ ప్రయోజనాలకోసమే తప్ప మరొకటికాదు. ఇతరుల రాజకీయ సాంస్కృతిక, ఆర్థిక ప్రాబల్యాన్ని తిరస్కరించి తమ విశిష్టతను చూపించు కోవడానికి ఒక నిరసన మార్గంగా, ఆత్మ ప్రత్యయాన్ని వెలార్చే ఒక సాధనంగా భాషలో స్వచ్ఛతాభావాన్ని ఉపయోగిస్తారు. ఒక జాతి వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుటం చేసే ప్రకృష్టసాధనం భాష. సంస్కృతీపరంగా అవిభాజ్యంగా కలిసి పోయింతర్వాత వేర్పాటు కష్టసాధ్యమైన పని. దానికి ఒక మహోద్యమం కావాలి.

ఆంధ్రదేశంలో ఆర్యసంస్కృతికి వ్యతిరేకంగా ఎటువంటి మహోద్య మాలూ ఆనాడూ లేవు, ఈనాడూ లేవు. అందువల్ల భాషాపరంగా సంస్కృత నిరసన ఎప్పుడూ ప్రస్ఫుటం కాదు. కాకపోతే కొంత స్వభాషాభిమానం అక్కడక్కడా గోచరించవచ్చు. పొన్నికంటి తెలగన్నకుగాని, కూచిమంచి తిమ్మకవికిగాని ఆటువంటి వీరావేశముందని చెప్పడానికి ఎటువంటి ఆధారాలూ లేవు అచ్చ తెలుగులో తప్ప మరోవిధంగా రచనలు చేయము అని ప్రతిజ్ఞ చేసిన కవులెవ్వరూ తెలుగులో లేరు. అంత వీరాభిమానమే ఉంటే తద్భవాలు మాత్రం ఎట్లా పనికివస్తాయి. బిరుదులు, పేర్లు దేవభాషలోనే ఉంచుతామని సగౌర

వంగా ఎందుకు చెప్పుకుంటారు? అర్వాచీన కవుల్లో ఈ అభిమానం కొంచెం పెరిగి ఉంటే పెరిగిఉండవచ్చుగాని తద్భవాలను కూడా పరిహరించగలిగిన శక్తిసామర్థ్యాలుగాని, దురభిమానం కాని ఏర్పడలేదు.

భాషలో సంస్కృత సమాలను పరిహరించినవాళ్ళు కావ్యేతివృత్త విషయంలో సంస్కృతభాషలోని వస్తువులను పరిహరించారా? మహమ్మదీయ ప్రభువుల ఆస్థానాలలో బహుమతులందుకున్నవారూ, ఆ ప్రభువులకు కావ్యాలంకితం చేసినవారూ తపతీసంవరణోపాఖ్యానాలూ, యయాతి చరిత్రలూ ఇతివృత్తంగా తీసుకోవడం ఎందుకు? ఏ ఇబ్రహీంకుతుబ్షా చరిత్రనో, అమీనుఖాను చరిత్రనో, కాకపోతే మహమ్మదు ప్రవక్త చరిత్రనో ఇతివృత్తంగా తీసుకోవచ్చు. ఆ పని వారు చేయలేదు. అతిశయించిన ఆంధ్రాభిమానమే ఉట్టిపడుతున్నదనుకుంటే తెలుగు దేశానికి, ప్రజలకు సంబంధించిన ఇతివృత్తాన్ని స్వీకరించి ఉండవచ్చు. ఆ పనీ చేయలేదు. అందువల్ల ఈ కవులకు సంస్కృతం పట్లగాని, ఆర్య సంస్కృతిపట్లగాని ఎటువంటి వైరస్యమూ లేదు. వల్లమాలిన తెలుగు అభిమానమూ లేదు. హిందూమతానికీ, సంస్కృతానికీ అచ్చ తెలుగు కావ్యాలను రచింపజేయడం ద్వారా ఏదో రాజకీయ ప్రయోజనాన్ని సాధించాలని మహమ్మదీయ ప్రభువులు కుట్ర చేశారని భావించడానికి కూడా ఎటువంటి ఆధారమూ లేదు. అచ్చ తెలుగు కావ్యాన్ని రచింపజేసినందువల్ల తెలుగు మీద మహమ్మదీయ ప్రభువులకు చాలా ఆదరం ఉందని చెప్పడమూ భావ్యం కాదు.

తెలుగుదేశానికి ప్రజలకు సంబంధించిన ఇతివృత్తాన్ని తీసుకున్నా సంస్కృతభాషా పదాలను పరిహరించడం కష్టమైనప్పుడు సంస్కృత సాహిత్యంలోని కథల్ని ఇతివృత్తంగా తీసుకున్నప్పుడు అది మరింత కష్టమని చెప్పకతప్పదు. అచ్చ తెలుగు కవుల రచనల్లో ఈ శ్రమ అడుగడుగునా ద్యోతకమవుతుంది. కేవలం కథను మాత్రమే తీసికొని ప్రబంధంగా తీర్చిదిద్దిన సందర్భాలలో కూడా మూలరచన ప్రభావం, తద్వారా ఆ భాషా ప్రభావం పడకతప్పదు.

భాషలో వాడుకలో ఉన్న పదాలతో రచన సాగించినంతవరకు కవికీ, పాఠకుడికీ కూడా ఇబ్బంది ఉండదు. వాడుకతో ఉన్న పదాన్ని వాడే వీలులేక

పర్యాయ పదాన్ని వెదుక్కోవలసి వచ్చినప్పుడు పదం ఉంటే సరే, లేకపోతే పదాన్ని కల్పించుకోవలసి వస్తుంది. ఈ కల్పించుకోవడంలోనే కృతకత్వం చోటు చేసుకుంటుంది. దీన్ని ఎంతగా పరిహరించగలిగితే రచన అంత సహజంగా ఉంటుంది. ఈ కృత్రిమత్వాన్ని కొంతైనా తగ్గించడానికే బిరుదులూ, పేర్లూ యథాతథంగా వాడడం.

సామాన్య ప్రబంధాలలో అవసరానికి మించి తత్సమ పద బాహుళ్యమూ, అచ్చ తెలుగు కావ్యాలలో అవసరానికి మించి కృతక పద బంధ నిర్మాణమూ ఉన్నాయనడంలో అతిశయోక్తిలేదు. ఈ రెండు కారణాలవల్లే ఈ రెండు రకాల కావ్యాలూ సామాన్య పాఠకులకు అందుబాటులో ఉండవు. సామాన్య ప్రబంధాలను అర్థం చేసుకోగలిగిన వారికి అచ్చ తెలుగు కావ్యాలు కృత్రిమత్వం వల్ల కొంత ఎబ్బెట్టుగా ఉంటాయి. గూఢంగా సంస్కృత పదాల్లో చెప్తే సభ్యంగా, గంభీరంగా కనిపించే భావాలు తెలిసిన తెలుగు మాటల్లో చెప్తే అసభ్యంగా, అనాగరికంగా కూడా కనిపించవచ్చు. అచ్చ తెలుగు కవులు ఈ ప్రమాదాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. అందుకే తక్కిన ప్రబంధాల్లో సుదీర్ఘంగా సాగిన కొన్ని వర్ణనలు అచ్చ తెలుగు కావ్యాలలో కుంచించుకు పోయాయి.

తెలుగు వాళ్ళకు ప్రత్యేకమైన ఆచార వ్యవహారాలు, మజ్జిన భోజనాలు, వేష భాషలు, చెట్లూ పుట్టలూ, పశువులూ పక్షులూ, పరిసరాలూ వర్ణించేటప్పుడు అచ్చ తెలుగు అసహజంగా అనిపించదు. సామాన్య ప్రబంధాలలో కూడా ఇటు వంటి సందర్భాలలో రచన దేశ్య పద బహుళంగానే ఉంటుంది.

సంస్కృతంలో దీర్ఘ సమాస రచన సహజం. తెలుగులో అసహజం. సంస్కృత సమాసాలను తెలుగులో కూడా సమాసాలుగా అనువదించినప్పుడు తెలుగు సమాసం కృతకమవుతుంది. ఇటువంటి కృతక సమాస నిర్మాణం తొలి అచ్చ తెలుగు కవులలో కంటే అర్వాచీనులలో అధికంగా కనిపిస్తుంది. అర్వాచీన కాలంలోని అచ్చ తెలుగు కావ్యాలకు బహుళ ప్రచారం లేకపోవ డానికి ఇది ఒక కారణం. అప్పకవి కాలం నుండి బిరుదులు, పేర్లు కూడా తెలుగు చేయడం మొదలయింది. కృత్రిమత్వాన్ని ఇది మరింత పెంచింది.

తెలుగు ప్రధానంగా ఆదాత్మ భాష. ఏ భాషా పదాన్నైనా తేలిగ్గా తనలో ఇముడ్చుకొనగలదు అసంఖ్యాకంగా సంస్కృత పదాలు చేరి తెలుగు లోకి అనేక నూతన ధ్వనులను ప్రవేశ పెట్టాయి. ద్రావిడ భాషా ధ్వని వ్యవస్థలో లేని మహాప్రాణ వర్ణాలు, శ, ష లు సంస్కృత పదాల మూలంగానే తెలుగులో చేరాయి. అందువల్ల తెలుగు వర్ణమాల విస్తృతిని పొంది అనేక అన్య భాషా పదాలను తనలో తేలికగా చేర్చుకోగలిగింది. ఈ సౌలభ్యం వల్ల సామాన్య వ్యవహారంలో విస్తారంగా వచ్చి చేరిన అన్య దేశ్యాలను సామాన్యులు గుర్తిం చడం కూడా కష్టమే అయింది.

అచ్చ తెలుగు కవులు సంస్కృత పదాలను యథాతథంగా వాడకూడదు. కాబట్టి వాటిని తెలుగుభాషా ధ్వని వ్యవస్థకు అనుగుణంగా మార్చుకుని ప్రయో గించారు. వీటినే మనం తద్భవాలంటాం. ఈ తద్భవాలను స్థూలంగా రెండు రకాలుగా విభాగించవచ్చు. ఒకటి, సామాన్యుల వ్యవహారంలోకి వచ్చిన సంస్కృత పదాలు వారి వాడుకలోనే మార్పును పొంది కలిసిపోయినవి. రెండు, కవులు తమ అవసరం కోసం తద్భవాలుగా మార్చుకొని తెచ్చుకొన్నవి. ఈ తద్భవీకరణ ప్రక్రియలో మూలపదంలోని సంయుక్తాక్షరాలు అసంయుక్తాలు గానో, ద్విరుక్తాలుగానో మారడం, మహాప్రాణాలు అల్పప్రాణాలుగా మారడం, శ, ష లు సకారంగా మారడం, పదాదిన స్వరం వచ్చిచేరడం మొదలైన మార్పులు కలుగుతాయి. కవులు సంస్కృత పదాలను తద్భవాలుగా మార్చు కొనేప్పుడు ఒక పదానికి అనేక రూపాలు ఏర్పడవచ్చు. ఉదా : భక్తి = భగితి, బత్తి, లక్ష్మి = లచ్చిమి, లచ్చి.

అచ్చ తెలుగు కవులు సంస్కృత సమాసాలను విస్తృతంగా అనువదిం చారు. ఈ అనువాదాలు కూడా చాలా సందర్భాలలో కృతకంగా ఉంటాయి. అంటే సామాన్య వ్యవహారంలో ఎక్కడా ఉండవు. ఉదా : జమిలి చౌవంచ తేర్ల రాచలి వెలుంగు, దుగతిగ తీపారు తూపుదొర, ఈరైదు కుత్తుకల పొల యోరెపు మన్నీడు మొ॥

కేవల దేశ్య పదఘటితంగా కావ్య రచన కెవరూ పూనుకోకపోవడం గమనార్హం. ఆ నియమం మరింత కఠినమేమో!

# 5. ఆద్య తెలుగు రామ గ్రంథము

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా॥[1]

వేదవేద్యుడైన ఆ పరమ పురుషుడే దశరథాత్మజుడై అవతరించగా సాక్షాద్వేదమే ప్రాచేతసుని వలన రామాయణ రూపంలో అవతరించిందని వాల్మీకే రామాయణంలో పేర్కొన్నాడు. కాబట్టే వాల్మీకి అనే గిరిలో ఉద్భవించి రాముడనే సాగరాన్ని చేరిన రామాయణమనే మహానది సకల భువనాన్నీ పునీతం చేస్తున్నది. రామాయణం అంటే ఇటువంటి పవిత్రభావం కలగడానికి తత్కథానాయకుడైన శ్రీరామచంద్రుని ధర్మయుక్తమైన ప్రవర్తనే కారణం.

కోసలదేశంలో సరయూనదీ తీరంలో అయోధ్యానగరాన్ని దశరథుడు పాలించాడు. దశరథుని పెద్దకొడుకు శ్రీరాముడు. మిథిలా నగరాధిపతి అయిన జనకుని కూతురు సీతను వివాహం చేసుకున్నాడు. సవతితల్లి కోర్కె మేరకు పద్నాలుగేళ్ళు రాజ్యాన్ని విడిచిపెట్టి పితృవాక్య పాలన నిమిత్తం భార్యతోను, సోదరుడు లక్ష్మణునితోనూ అరణ్యవాసం చేశాడు. లంకేశ్వరుడైన రావణుడు తన భార్యను అపహరించగా శ్రీరాముడు సుగ్రీవుడనే వానర రాజుతో మైత్రిచేసి వానరసేన సహాయం రాగా రావణుని చంపి, భార్యాసమేతంగా అయోధ్య చేరుకొని పట్టాభిషిక్తుడై జనరంజకంగా పరిపాలించాడు. సంగ్రహంగా రామాయణకథ ఇది. వాల్మీకి నాటికే మానవాతీతమైన మహత్తర గాథగా ఇది ప్రచారంలోకి వచ్చింది. సుశీలుడు, శూరుడూ అయిన ఉత్తమ క్షత్రియుని చరిత్రను తీసుకొని వాల్మీకి రమణీయమైన కావ్యాన్ని రచించాడు.

భారతీయ జనజీవనంలో రామాయణం అద్వితీయమైన పాత్రను నిర్వహించింది. దానికి కారణం అది బోధించే ఆదర్శాలే, ఉత్తమ గుణగణాలే. భక్త్యుపాసనా సంవలితమైన కర్మమార్గం ప్రతిపాదితం. నాయకుడైన రాముడు శమదమాది సద్గుణశోభితుడు, శరణాగత వత్సలుడు, కృతజ్ఞుడు, దీనానుకంపి,

ఆదర్శమిత్రుడు, ధర్మమూర్తి. నాయిక అయిన సీత లోకైశ్వర్యాలకు ప్రతీక పరని ఉత్తమ గృహిణి, స్త్రీజాతికి మేలుబంతి. ప్రతి నాయకుడైన రావణుడు అనంతశక్తి సంపన్నుడు, అధర్మమే లేకపోతే సర్వలోకాలను సంరక్షింప గలిగిన సత్వసంపన్నుడు. సమాజం - వ్యక్తి, రాజు - ప్రజ, కుటుంబం - అందులోని సభ్యులు మొదలైన ద్వంద్వాలు ఉత్తమంగా చిత్రితాలు. ఇంద్రియ జయం సర్వ ప్రధానం. ధర్మపాలనం సర్వసుఖ మూలం. కృతజ్ఞత మానవత్వ లక్షణం. ఇహ పరలోక సుఖ దుఃఖాలకు శుభ పాప కర్మాచరణమే కారణం ఆశావాదిత్వం భారతీయాత్మకు ముఖ్యం. ఇవి రామాయణంలోని ప్రధాన గుణాలు.[2] ఈ గుణాలవల్ల రామాయణం సర్వులకూ శిరోధార్యమయింది. దుష్టశిక్షణం శిష్టరక్షణం, భక్తానుగ్రహం పతితోద్ధరణం రామావతార ప్రయోజనాలు. ఇది విశ్వజనీనమైన విలువలు కాబట్టే ఏ ధర్మాన్ని అనుసరించేవారైనా ఈ కథను ఆదర్శంగా గ్రహించవచ్చు. శరణుకోరి వచ్చిన విభీషణుని కపిరాజు తిరస్కరించాడు. "మిత్రభావము పొందిన వానిని తప్పున్నను వదలలేను. ఇది సత్పురుషులకు గర్హింపదగినది కాదు" అన్నాడు శ్రీరాముడు.

> "స కృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే
> అభయం సర్వభూతేభ్యోదదామ్యే తద్వ్రతంమమ॥"[3]

'నీ వాడిని అని చేరి యాచించిన సర్వభూతాలకు అభయమిస్తాను, ఇది నా వ్రతం' అంటూ శ్రీరాముడు విభీషణుని స్వీకరించాడు. జీవాత్మలోని గుణాగుణాలను గ్రహించక కోరినప్పుడు దరిచేర్చే పరమాత్మని పవిత్రత రామాయణంలో ప్రపంచితమయింది. అటువంటి గుణం రామునికే యోగ్యమయింది.

"రామస్య అయనం స్థానం రామాయణం" అని వ్యుత్పత్త్యర్థం. 'ఓం నమో నారాయణాయ' అనే అష్టాక్షరిలోని 'రా', 'నమశ్శివాయ' అనే పంచాక్షరిలోని 'మః' లతో కూడిన రామనామం హరిహరాభేదత్వాన్ని సంతరించు కున్నట్లున్నది.

భారతదేశంలో ఏ ప్రాంతానికి వెళ్ళినా రామాయణ పారమ్యం వ్యక్త వ్యక్తమవుతుంది. అందరూ రాముణ్ణి తమ వాడుగా భావించుకున్నారు.

తెలుగుదేశం దీనికి అపవాదం కాకపోవడమే కాదు, మరింత ఆత్మీయతా భావాన్ని సంతరించుకున్నది. సీతమ్మ తెలుగు పడుచైపోయింది. రామయ్య తెలుగు ప్రభువై పోయాడు. తెలుగువారి సాంఘికాచారాలన్నీ సీతారామాంకితాలు. "శ్రీరామ జయం"తో తెలుగువాడి రాత అరంభమవుతుంది. తెలుగు బిడ్డకు ఆశీస్సు 'శ్రీరామ రక్ష', ఆపదలలో రామనామం 'తారక మంత్రం'. తెలుగు నాట సీతారాములు సంచరించని బాటలేదు. అందుకే సీతారాములు తెలుగువారి ఇష్ట దైవతాలు. రామాయణం నిత్య పారాయణ గ్రంథం.

తెలుగు కవులకు రామకథ అభిమాన వస్తువు. పుణ్యప్రదాయిని. మోక్ష దాయిని. తిక్కన నుండి నేటి వరకు ఎందరు కవులు రామాయణ కథను ఇతి వృత్తంగా గ్రహించి రచన చేశారో రావూరి దొరసామి శర్మ, వండా శమంతక మణి రాసిన గ్రంథాలునిరూపిస్తున్నాయి.[4]తిక్కన 'ఎత్తరినైనను ధీరోదాత్తనృపో త్తముడు రామధరణీపతి సద్వృత్తము సంభావ్యమగుట....'[5] అన్నాడు. విశ్వ నాథ 'మరలనదేల రామాయణంబన్న' అని ప్రశ్నించుకొని సమాధానం చెప్పాడు. తిక్కన నుండి విశ్వనాథ దాకా ఆ తరువాత కూడా రామకథను ఇతివృత్తంగా తీసుకున్న వారి సంఖ్య తెలుగులో విస్తారమే. రామాయణం రాయకపోతే మరో ఇతివృత్తంతో తాము రాస్తున్న కావ్యంలో ఏదో విధంగా రామకథను ఇరికించిన వారెందరో ఉన్నారు. పొన్నికంటి తెలగన్న 'యయాతి చరిత్ర'లో రామకథను కూర్చాడు. మను చరిత్రాది ప్రబంధాలలో దశావతార వర్ణనలలో రామావతార వర్ణన చేశారు.

తెలుగులో అన్ని విధాల సృజనాత్మక సాహిత్య ప్రక్రియలలోనూ రామ కథను రచించారు. ముఖ్యంగా అన్ని విధాల కవిత్వ ప్రక్రియలూ రామకథాంకి తాలు. కూచిమంచి తిమ్మకవి తొలిసారిగా అచ్చ తెలుగులో రామాయణాన్ని ప్రబంధంగా రచించాడు

ప్రబంధం అనే మాటను సంస్కృతాంధ్ర లాక్షణికులంతా కావ్య సామాన్య వాచిగానే ప్రయోగించారు. దండి కావ్య ప్రబంధాలకు అభేదం చెప్పాడు. తెలుగు కవులందరూ ప్రబంధ శబ్దాన్ని మహాకావ్య పరంగానే వాడారు. శ్రీ కృష్ణదేవరాయల కాలంనుండీ ప్రబంధ శబ్దానికి ప్రాచుర్యం పెరి

గింది. విమర్శకులు అప్పటినుండి వచ్చిన కావ్యాలను ప్రబంధాలని పిలుస్తున్నారు. వాటిని ఒక ప్రత్యేక ప్రక్రియగా గుర్తించారు. ప్రబంధ లక్షణాలకూ, మహా కావ్యలక్షణాలకూ భేదం కనిపించదు. ప్రబంధంలో కథ కృశాంగ, శృంగార రస నిర్భరమూనని కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వ తత్వవిచారంలో ప్రబంధాన్ని కావ్యంనుంచి వేరుచేసే లక్షణాలుగా పేర్కొన్నాడు. కావ్యధర్మ మైన వర్ణన, నాటిక ధర్మమైన సంభాషణా విధానం, కల్పన వీటి సమాహార స్వరూపం ప్రబంధం అని వేటూరి ప్రభాకరశాస్త్రి తెలుగు-మఱుగుల్లో పేర్కొ న్నారు. వైష్ణవము బాగా వ్యాపించిన శ్రీకృష్ణదేవరాయల కాలం నుండి ద్రావిడ వేద ప్రబంధాన్ని దృష్టిలో ఉంచుకొని తెలుగు సాహిత్యంలో ప్రబంధం అనే పేరు ప్రచారంలోకి వచ్చిందని యం. కులశేఖర రావు ఊహించారు. కాని తమిళంలో కూడా ప్రబంధానికి ప్రత్యేక లక్షణాలేవీ కనిపించవు. ప్రబంధ కర్తలంతా ప్రసన్నులే. వారు గానం చేసిన పాశురాలన్నీ పరమ పురుషుణ్ణి ఉద్దేశించినవే. పరమాత్మని ఉద్దేశించిన సాహిత్యమంతా ప్రబంధంగా ఆ కవిత్వమే ప్రకృష్టమైనదిగా వారు భావించారు. పరమ పురుషుని లీలా విలాసాల వర్ణనాత్మకమైన కవిత ప్రబంధమై తెలుగు సాహిత్యంలో సాధారణ కావ్యానికి అన్వయించింది. విష్ణుతత్వ ప్రతిపాదకమైన ఆముక్తమాల్యదను పరమ వైష్ణవుడైన శ్రీకృష్ణదేవరాయలు ప్రబంధంగా భావించాడు. సమకాలికులైన కవులంతా అదేవిధంగా భావించారు. ఈ విధంగా తెలుగు సాహిత్యంలో కావ్య పరంగా ప్రచారంలోకి వచ్చిన ప్రబంధ శబ్దం ఆధునిక కాలంలో విమర్శకుల దృష్టిలో ప్రత్యేక శాఖగా రూపొందింది.

కవి సార్వభౌముడు కూచిమంచి తిమ్మకవి తన కావ్యాలను ప్రబంధాలు గానే పేర్కొన్నాడు. సంస్కృత వాఙ్మయంలో మహాకావ్యమై విలసిల్లిన శ్రీమద్రామాయణాన్ని అచ్చతెలుగు కావ్యంగా పరివర్తితం చేస్తూ దాన్ని కబ్బముగా పేర్కొన్నాడు. కబ్బము కావ్యశబ్దభవం.

అని యెల్లవేల్పులం జే
ర్కొని కబ్బము కూరుపరుల గురించి గడంకం
గొనియాడి యచ్చ తెలుగున
బనివడి, కబ్బంబు గూరుపం గడఁగనెదన్

ఆశ్వాసాంత గద్యంలోకూడ "తిమ్మయ నామదేయ ప్రణీతంబై యచ్చతెలుగు రామాయణమను మహాకావ్యమందు బాలకాండము సర్వమేకాశ్వాసము" పద్ధతిలో మహాకావ్యమనే మాటనే తిమ్మకవి ప్రయోగించాడు. దీన్ని ప్రబంధమనిపిలిచినా సముచితమే.

మహాకావ్యం సర్గబంధమై, ధీరోదాత్తనాయక చరితమై అష్టాదశ వర్ణనలతో ఒప్పారాలనీ, కాంతాసమ్మితమై, ఆనంద పర్యవసాయిగా, ఉపదేశయుక్తంగా ఉండాలనీ లక్షణ కర్తలు నిర్వచించారు. ఇది గద్యమనీ, పద్యమనీ, ఉభయాత్మకమనీ మూడు విధాలు. తెలుగులో నన్నయ ఒరవడి ఉభయాత్మకమైన చంపూ పద్ధతి. తెలుగులో దీనినే సామాన్య కావ్య పద్ధతిగా కవులు గ్రహించారు. తక్కినవి విరళం. సంస్కృత నాటకాలను, గద్య కావ్యాలను కూడా తెలుగు కవులు గద్యపద్యోభయాత్మకమైన చంపూ రచనలుగా అనువర్తించారు. కూచిమంచి తిమ్మకవి కూడా అచ్చతెలుగు రామాయణాన్ని చంపూ కావ్యంగానే తీర్చిదిద్దాడు.

తిమ్మకవి అనంతర ప్రబంధ యుగంవాడు. ఈ యుగం పిల్ల వసు చరిత్రల యుగం. కావ్యాలు, శతకాలు, దండకాలు, లక్షణ రచనలు మొదలైన విభిన్న ప్రక్రియలలో తిమ్మకవి రచనలు చేశాడు. భాషావిషయంలో కూడా వైవిధ్యాన్ని చూపించాడు. తన అచ్చతెలుగు రచనలలో జనవ్యవహారంలోని తెలుగు పలుకుబడుల సొగసులను చూపించాడు.

అచ్చతెలుగు రామాయణం పురాణమూ, ఇతిహాసమూ, కావ్యమూ కూడా. వాల్మీకి రామాయణమూ ఇటువంటిదే. పురాణ, ఇతిహాసలక్షణాలకన్నా కావ్యగుణాలు ఎక్కువగా ఉండడం వల్ల రామాయణం ఆదికావ్యమై వాల్మీకిని ఆదికవిని చేసింది. ఇతర భాషలలో రామాయణానువాదాలు కూడా మహాకావ్యాలే.

అచ్చతెలుగు రామాయణం సంక్షిప్త కథాత్మకం. సాధారణంగా భాషానియమాలు పెట్టుకొని చేసే ఏ రచన అయినా సామాన్య రచనకంటే సంక్షిప్తంగానే ఉంటుంది. క్లిష్టమైన భాషానియమాలు కవి స్వేచ్ఛను కొంత నిరోధిస్తాయి కాబట్టి ఈ సంక్షిప్తత తప్పదు. ఆ దృష్ట్యా చూచినప్పుడు అచ్చతెనుగు

రామాయణం తక్కిన నియమబద్ధ రచనలకంటే కొంత విస్తృతమనే చెప్పవలసి ఉంటుంది. 1329 గద్యపద్యాల చంపూరచన ఇది. అయినా సంగ్రహ రచన అనకతప్పదు. సంగ్రహరచన అయినప్పటికీ తిమ్మకవి అష్టాదశ వర్ణనలకు అవకాశాన్ని కలిగించుకున్నాడు. పుర, నాయక, వివాహ, పుత్రోత్పత్తి, చంద్రోదయ, సూర్యాస్తమయ, వన, గిరి, సముద్ర, రాయబార, యుద్ధ వర్ణనాదులు విస్తారంగా చేశాడు.

గ్రంథంలో మొదటి నాలుగు కాండలు ఒక భాగంగాను, చివరి రెండు కాండలు మరొక భాగంగాను తిమ్మకవి గ్రహించాడు. సుందర, యుద్ధకాండలు రెండూకలిసి గ్రంథం సగ భాగానికి పైగా ఆక్రమించాయి. దీనికి కారణం తిమ్మకవి నాటి సామాజిక పరిస్థితులు, అతని ఆధ్యాత్మిక దృష్టి కావచ్చు. అస్థిరమైన రాజకీయ వ్యవస్థ, సామాజికంగా కలుగుతున్న విపరీత పరిణామాలు, తన్మూలంగా కవి పండితులకు తగ్గిన గౌరవాదరాలు, ధనహీనతవల్ల కలిగిన దుర్గతి ఇవన్నీ కవిని ఆపదుద్ధారకమైన రామాయణంవైపు నడిపించి ఉంటాయి. రామాయణంలో అధిక ఫలాన్నిచ్చే కథా భాగాలపై కవి దృష్టి కేంద్రీకరించి ఉంటాడు.

ఉమాసంహిత రామాయణ పారాయణ మాహాత్మ్యాన్ని వివరిస్తుంది. రామతారక మంత్రోపదేష్ట పరమేశ్వరుడు. ఆయన లౌకిక ఫలితాలకోసం రామాయణ పారాయణ విధానాన్ని పార్వతికి వివరించాడు. రామాయణంలో సత్ఫలితాలనిచ్చే సర్గలు ఇరవై. వాటిలో పదకొండు సర్గలు సుందర యుద్ధ కాండలలోనే ఉన్నాయి.

లంకా విజయం
మారుతి నిర్వేదం
హనుమత్కృత సీతాదర్శనం
అంగుళీయ ప్రదర్శనం
కాకానుగ్రహం
త్రిజటాస్వప్నం
-ఇవి ఆరూ సుందర కాండలోనివి.

రావణ కిరీట భంగం
సీతాంజనేయ సంవాదం
విభీషణ సంగ్రహం
శ్రీరామ పట్టాభిషేకం
సీతానయనం

-ఈ అయిదూ యుద్ధకాండలోనివి. అధిక పల్లవదాలయిన కథా భాగాలు ఎక్కువగా ఉన్న సుందర యుద్ధకాండలపై తిమ్మకవి ప్రత్యేక దృష్టి నిలిపి ఉంటాడు.

మహా కావ్యలక్షణమైన అష్టాదశ వర్ణనలను తిమ్మకవి అచ్చ తెలుగులో మనోహరంగా నిర్వహించాడు. అచ్చ తెలుగులోనే యమకాను ప్రాసాది శబ్దాలంకారాల ప్రయోగం తిమ్మకవి నేర్పునకు తార్కాణం.

పెనురాచ ముంగిళ్ళఁ బెంపుడు తోఁటల
మావులు మావులు ప్రోవు మీఱ
నాడెంపుఁగోటల నాగవాసమ్ములఁ
గొమ్మలుఁ గొమ్మలు గొనబుఁ జూప
గరితల బొమ్మల గడితంపు గోడలఁ
బట్లును బట్లును బసఁబొసంగ
దొడ్డిపట్టుల దొడ్డ దొరసానుల యొడళ్ళ
సొమ్ములు సొమ్ములు సొంపు నెరప

నంగడులఁ జేలఁదద్దయు రంగెసంగి
ముత్తెసరులును బరువంపు ముత్తెసరులు
వలుఁదరలని సిరులఁబల్కులును మెఱసి
వీదలరు వేల్పురానెల వీడుగాఁగ.[7]

మేదలా రతనంపుగోదలా యపరంజి
బేదలా యేవాడఁ బెంపెసంగు
మావులా బలితంపుటావులా చెంగల్వ
బావులా యేత్రేవఁ బసదనర్చు....[8]

అని కావ్యారంభంలోనే అయోధ్యాపురాన్ని వర్ణించిన తీరు కడు మనోహరం. యోగులకూ మహర్షులకూ నిలయమైన బ్రహ్మనగరమూ, సర్ప రాజులుండే పాతాళమూ, అమృతాంధసులైన నిలింపులుండే స్వర్గమూ ఈ నగ రానికి ఈడుకావట. తేరులతోనూ, కొమ్ము దేనుగుల బారులతోనూ, చక్క దనము గల రాచదారులతోనూ ఈ నగరం ప్రకాశిస్తున్నదట. చతుర్వర్ణాలు, వేశ్యలతో సహా సంప్రదాయ పద్ధతిలో తిమ్మకవి నగర వర్ణన చేశాడు. నాయక నాయికా వర్ణనాదులు కూడా సామాన్య ప్రబంధాల ధోరణిలోనే చేశాడు. యుద్ధ కాండ గ్రంథంలో దాదాపు సగ భాగాన్ని ఆక్రమించింది. అందులోని యుద్ధ వర్ణనల గురించి పేర్కొన నవసరం లేదు.

కావ్యానికి ఆత్మ ధ్వని. అయోధ్యాకాండం ఆరంభంలోనే భావి కథా సూచనాత్మకంగా తిమ్మకవి సూర్యాస్తమయ వర్ణనం చేశాడు.

> పగలు సేయుచు వేఁడిమి మిగుల జగము
> గ్రాఁచు జమునబ్బమున్నిటఁ గలిసె ననియొ
> తొగ వెలందుక నగియె నమ్మగున పెంపు
> గని సయింపక తమ్మి మొగంబు మొగిచె[9]

పగటిపూట తన వేడిమితో జగత్తునంతా ఉడికించే సూర్యుడు సముద్రంలో పడ్డాడుకదా అని తొగవెలందుక సంతోషంతో నవ్వింది. ఆమె పెంపును చూచి సహించలేక తమ్మి మొగం ముడుచుకొంది. సూర్యునివల్ల వికసించే తామర సూర్యాస్తమయాన్ని సహించలేక దుఃఖంతో ముఖం ముడుచుకోవడం. శత్రు వైన సూర్యుడు అస్తమించడంతో కలువ వికసించడం సహజమే. కలువ వికస నానికి తామర మొగం ముడిచిందని తిమ్మకవి అభివర్ణించాడు. భరతుని రాజ్యా ర్హతకు అడ్డుగా ఉన్న శ్రీ రాముడు అరణ్యానికి వెళ్ళడం కైక సంతోషానికి కారణం. ఆమె సంతోషానికి కారణమైన తన కుమారుడు శ్రీరాముని వనవాసం కౌసల్యకు దుఃఖ కారణం. సూర్యవంశ సంజాతుడైన దశరథుడు దుఃఖ సము ద్రంలో మునుగగా కైక తాను రాజమాత నౌతున్నందుకు సంతోషిస్తున్నది. ఆ కైక సంతోషానికి కారణమైన దశరథుని దుఃఖం కౌసల్యకు దుఃఖ కారణ మైంది. కైకను కలువగాను, కౌసల్యను తామరగానూ ఊహించాలి. ఈ సూర్యా స్తమయ వర్ణనలో తిమ్మకవి ఇటువంటి వ్యంగ్య వైభవాన్ని సాధించాడు.

అచ్చ తెలుగు రామాయణం కావ్యలక్షణానుగుణంగా శ్రీరామ పట్టాభిషేకంతో సుఖాంతమయింది. సంస్కృతంలో రామాయణం ఎంత ప్రభావశాలియో తెలుగులోనూ అంత ప్రభావశాలియే. ఇక్కడ హెచ్చుతగ్గులేమీ లేవు. సంస్కృతం దేవభాష అనీ, అందులో ఉన్న గొప్పదనం, మహిమ ప్రాంతీయ భాషల్లో ఉండదనీ అనుకునేవారికి తిమ్మకవి సమాధానం చెప్పాడు:

తెనుఁగు చదువునఁ బున్నియంబెనయదనుచుఁ
గొందఱాడుదు రాడినఁ గొఱఁత యేమి
సిరిమరాయంచు నుడివిన చెనఁటిబోయ
నెఱ నిరాభారియగుటయె గుఱుతుగాదె.[10]

భాష ప్రధానం కాదు, భక్తిభావమే ప్రధానం. కేవలధ్వనిలో ఏముంది? తనకు ముందు ఎన్నో రామాయణాలున్నా రామాయణంమీది ప్రీతివల్ల తిమ్మకవి అచ్చ తెలుగులో రామాయణ రచన చేశాడు. యయాతి చరిత్రలోని రామాయణ కథా సంగ్రహం తిమ్మకవికి స్ఫూర్తినిచ్చి ఉంటుంది. పూర్వ కవుల సంప్రదాయాన్ని గాఢంగా నమ్మినవాడు తిమ్మకవి. అందుకే వారి సంప్రదాయాన్ని జాగ్రత్తగా అనుసరించాడు.

పొత్తములఁదొంటి పెద్దలు హత్తుకొలిపి
నట్టి తెఱఁగున నుడువులందన్నియెడల
గుఱియరసిచూచి నెమ్మదిఁగూర్చినాఁడ
సందియంబెన్నకుఁడు నెఱజాణలెల్ల.[11]

రామాయణ ఫలాన్నికూడా ఈ విధంగా వివరించాడు గ్రంథాంతంలో-

పుడమి నీ పొత్తమెప్పుడు ప్రొద్దునెలయుఁ
జక్కలును గల్గునన్నాళ్ళు సొరిది ప్రోద
లిండ్లఁగోరినకోరికలిడుచు నిడుమ
లుడుగఁజేయుచుఁదిరమయి యుండుగాక! [12]

ఈ అచ్చ తెలుగు రామాయణం భక్తుల కోర్కెలను తీరుస్తుందనడంలో సందేహం లేదు.

# 6. అచ్చతెలుగు రామాయణం – లక్షణ సారసంగ్రహం

కవి సార్వభౌముడు కూచిమంచి తిమ్మకవి అనేక కావ్యాలు రచించడంతోపాటు 'లక్షణ సారసంగ్రహం' అనే లక్షణ గ్రంథాన్ని కూడా రచించాడు. తెలుగులో సాధారణంగా కవులే లక్షణ కర్తలుకూడా. పూర్వం కేవల లక్షణకర్తలు తక్కువే. కూచిమంచి తిమ్మకవికూడా లక్షణకర్త అయిన కవి. రుక్మిణీ పరిణయం, సింహగిరి మాహాత్మ్యం, నీలాసుందరీ పరిణయం, రాజశేఖర విలాసం, అచ్చ తెలుగు రామాయణం మొదలైన కృతులు రచించిం తర్వాతే తిమ్మకవి లక్షణ గ్రంథం రచించాడు. 'లక్షణ సారసంగ్రహము'కే సర్వలక్షణ సార సంగ్రహమనీ, సకల లక్షణ సారసంగ్రహమనీ కూడా పేర్లున్నాయి.

తిమ్మకవి 'జగదుపకారార్థము క్రొత్తగ లక్షణ లక్ష్యములు వితర్కించి బుధుల్ పొగడఁగఁ గృతిఁ జేసెద'నని చెప్పుకొన్నాడు. అప్పటికే ఎన్నో లక్షణ గ్రంథాలుంటే మళ్ళీ లక్షణ గ్రంథం ఎందుకు? అని ప్రశ్నించుకొని ఇలా సమాధానం చెప్పాడు తిమ్మకవి:

> తెలుఁగునకు మున్న లక్షణంబులు మహాక
> వీశ్వరులు పెక్కు రచియించి యిడిరిఁ కేల
> గూర్చ వలెనన్నఁ బ్రౌఢిమ కొఱకు నాకుఁ
> దెలిసిన తెరంగు నొక కొంత తేట పఱుతు.[2]

లక్షణ గ్రంథాలలో లక్ష్య ప్రదర్శనం రెండు విధాలుగా ఉంటుంది. లక్షణకర్తే స్వయంగా లక్ష్యరచన చేయడం ఒక పద్ధతి. పూర్వకవుల గ్రంథాల నుండి లక్ష్యప్రదర్శన చేయడం మరొక పద్ధతి. కూచిమంచి తిమ్మకవి ఈ రెండో పద్ధతినే అవలంబించాడు.

నన్నయ భట్టాదుల గృతు
లన్నిలిపిన లక్ష్యములును లక్షణములు యు
క్తిన్నెమకి కృతియొనర్చుచు
మున్నుగ నాంధ్రంబు చందమున్ విపరింతున్.[3]

కవులే లక్షణ కర్తలయినప్పుడు వారి లక్షణ గ్రంథాలకు వారి సృజనాత్మక రచనలనే లక్ష్యాలుగా చేసి పరిశీలించడం సహజమే. లక్షణ గ్రంథాల రచన భాష ఇట్లా ఉందని విశ్లేషించడానికి మాత్రమేగాక ఒక విధంగా రచయితలకు మార్గ దర్శక గ్రంథాలుగా ఉద్దేశించి జరిగింది అందువల్ల వ్యాకరణ గ్రంథాలలో ఛందోవిశేషాలకూడా విస్తృతంగా చోటు చేసుకున్నాయి. లక్షణ సారసంగ్రహంలోకూడా సుమారు నాలుగోవంతు ప్రాస, యతి ప్రకరణాలాక్రమించాయి. తిమ్మకవి లక్షణ గ్రంథంలో మరో ప్రధానాంశం శబ్ద స్వరూప నిర్ణయం. గ్రంథంలో మూడోవంతు భాగం ఇదే ఆక్రమించింది.

తిమ్మకవి అనంతునితో మొదలుపెట్టి అహోబలపతి, అప్పకవుల వరకు పన్నెండుగురు లాక్షిణికుల వాదాలను, ప్రయోగాలను చర్చించాడు. అరవైమూడు ప్రాచీన గ్రంథాలనుండి, ప్రసిద్ధ కవుల చాటువులతో సహా అనేక ప్రయోగాల నుదాహరించాడు. 1276 గద్యపద్యాల లక్షణ గ్రంథంలో దాదాపు 850 పద్యాలు పూర్వకవుల గ్రంథాలనుండి ఉదాహృతాలు. తిమ్మకవి పాండిత్యానికి పూర్వకవి గ్రంథ పరిచయానికి ఇవి తార్కాణాలు

పూర్వలాక్షణికుల వాదాలను తిమ్మకవి అక్కడక్కడా నిరాకరించాడు. మహాకవి ప్రయోగాలను చూపించి అనేక ప్రయోగాలను ప్రమాణీకరించాడు. కేతన ఎకారాంత రూపాలను తిరస్కరించి ఇయాంత రూపాలే ప్రమాణం అని చెప్పగా తిమ్మకవి ఎకారాంత రూపాలను కూడా ప్రామాణికాలుగానే అంగీకరించాడు. తన కావ్యంలో కూడా ప్రయోగించాడు.

పున్నెము (పీ - 11)
కన్నె (బాల - 103)
ముత్తెంపు చలువ చప్పరములు (సుందర - 9)
ఇయాంత రూపాలను కూడా ప్రయోగించాడు.

పున్నియంపు పెంపు (బాల. 64)
పల్లియ (బాల. 66)
ముత్తియంబులు (బాల 15)
మిద్దియ (సుందర. 9)
తిన్నియ (సుందర. 9)
గద్దియ (సుందర. 9)

తాయెద, పయ్యెద, ఉయ్యెల శబ్దాల నడిమి యకారం అత్వసహితంగా కూడా ఉండవచ్చునని తిమ్మకవి ప్రమాణీకరించాడు ముద్దరాజు రామన ఎత్వ సహితరూపాలను మాత్రమే అంగీకరించాడనీ అత్వ సహితరూపాలు కూడా ప్రామాణికాలేనని చెప్పి, కవిప్రయోగాలను చూపించాడు.

పయ్యెర బోదలపుడు (అయో. 40)
మేటి పయ్యర (బాల. 37)
ఉయ్యెల లరదములును (సుందర. 9)

ద్వితీయాశ్వాసంలో శబ్దప్రకరణం ఆసక్తిదాయకంగా ఉంటుంది. ఛందోబద్ధ రచనలలో కవులు సమయానుకూలంగా ఒకే శబ్దాన్ని అనేక విధాలుగా ప్రయోగిస్తారు. ఆ వైవిధ్యాన్ని తిమ్మకవి చక్కగా ప్రదర్శించాడు. ఉదాహరణకు పూవు శబ్దానికి పువు, పువ్వు, పూ అనే పర్యాయ రూపాలు; మామిడికి మామిడి, మావి అనే పర్యాయరూపాలు; దొవుకు దవు, దవ్వు, దొ అనే రూపాలు ఉన్నాయి మొగసాలకు మోసాల, మోసల అని కూడా రూపాలున్నాయి. మీనుకు బహువచనంలో మీలు, మీనులు అని రెండు రూపాలున్నాయి. ఈల్గుటకు సీల్గుట, ఇసుకుట అని రూపాలు. సామాన్య కావ్యాలలోనే ఈ రూపబాహుళ్యావసరం కనిపిస్తూ ఉండగా తిమ్మకవికి అచ్చతెలుగు కావ్యరచనలో మరింత అవసరం. అయినా తిమ్మకవి పూర్వ ప్రామాణిక కవుల ప్రయోగాలకు విరుద్ధమైన ప్రయోగాలు చేయలేదు లక్షణగ్రంథ రచనకు పూర్వమే లాక్షణిక ప్రామాణికాలైన రచన లనేకం చేశాడు.

సర్వలక్షణ సార సంగ్రహాన్ని పరిశీలిస్తే తిమ్మకవికి లక్షణ విషయంలోని దృక్పథం వెల్లడవుతుంది. పూర్వకవి ప్రయోగాలను ఆయన ప్రామాణికంగా భావించాడు. ఇతర లాక్షణికులు అప్రామాణికాలని చెప్పిన రూపాలను కూడా తిమ్మకవి పూర్వకవులు ప్రయోగించినందువల్ల ప్రామాణికాలుగా గుర్తించాడు. ఇది తిమ్మకవి శాస్త్రీయ దృక్పథానికి నిదర్శనం.

# 7. భాషా విశేషాలు

**వర్ణాలు :**

సంప్రదాయ వ్యాకరణాలలో భాషలో కనిష్ఠాంశంగా వర్ణాన్నే గుర్తిస్తారు. అర్థభేదక సామర్థ్యం లేని ధ్వనికి అంత ప్రాధాన్యం లేదు. దానికి ప్రత్యేక లిపిసంకేతం లేదు. వైదిక సంస్కృతంలో ఉన్న ఉచ్చారణ ప్రాముఖ్యం లౌకిక భాషలో లేదు. ప్రాంతీయ భాషల్లో అసలే లేదు. అర్థభేదకాలు కాని తుల్యోచ్చారణ కలిగిన ధ్వనుల సమూహాన్ని ఒక వర్ణంగా గుర్తించి దానికే లిపి చిహ్నాన్ని ఏర్పరచుకుంటాం. ఉచ్చరించే ధ్వను లన్నింటికీ లిపి సంకేతా లవసరం లేదు.

తిమ్మకవి 'లక్షణ సారసంగ్రహము'లో

> అ ఇ ఉ ఋ ఏవోలు నది దీర్ఘ సహితంబు
> లై ఔలు క గ చ జ లరయ ట డ ణ
> తదనలు పబమలు దగయరలవ సహ
> శ ళ లును తెనుఁగున వరలు గాని
> తక్కిన వర్ణముల్ దగులవు ....[1]

అని చెప్పాడు.

అచ్చులు

| | పురస్ | కేంద్ర | పశ్చాత్ |
|---|---|---|---|
| అగ్ర | ఇ ఈ | - | ఉ ఊ |
| మధ్య | ఎ ఏ | - | ఒ ఓ |
| అధస్ | - | అ ఆ | ఐ ఔ |

ఐ ఔ లు అయ్, అవ్‌లతో సమానం.

హల్లులు

| | | ఓష్ఠ్య | దంత్య | దంత మూలీయ | మూర్ధన్య | తాలవ్య | హను మూలీయ |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శ | శ్వాస | ప | త | - | ట | - | క |
| | నాద | బ | ద | - | డ | - | గ |
| స్పృష్టోష్మ | శ్వాస | - | - | - | - | చ | - |
| | నాద | - | - | - | - | జ | - |
| ఊష్మ | | - | - | స | - | - | - |
| అనునాసిక | | మ | న | - | ణ | - | - |
| పార్శ్విక | | - | ల | - | ళ | - | - |
| కంపిత | | - | ర | - | ఱ | - | - |
| అంతస్థ | | వ | - | - | - | య | - |

ప్రాకృతం నుండి థ, కన్నడం నుండి హ, పెర్షో అరబిక్ నుండి f (ఫ), z (జ) వచ్చాయి తెలుగులో మహాప్రాణ వర్ణాలు లేకపోయినా థ కారాది పదాలను దేశ్యాలుగానే గుర్తించాడు.

థివి (కిష్కింధ. 71)
థవళికాడు (యుద్ధ. 220)
థావు (యుద్ధ. 584)

f, z లు ఫ, జ లు గానే ప్రయుక్తాలు.

ఫౌజు (యుద్ధ. 125, 378)
వజీరు (అయోధ్య. 68, కిష్కింధ. 12, సుందర. 58)
వజీరుండు (యుద్ధ. 168)

హకారాది పదాలు కూడా తిమ్మకవి ప్రయోగించాడు. కొన్ని పదాలలో హకారాది రూపాలతోపాటు పదాది హకారం లోపించిన రూపాలు కూడా అచ్చ తెలుగు రామాయణంలో కనిపిస్తాయి.

హుంమాయి (పీ. 21)
హరివాణము (బాల. 49)
హరువు (కిష్కింధ 1)
హొంబమడికల్ (సుందర. 34)
హత్తించెనొకో (సుందర. 168)
హెచ్చరిక (యుద్ధ. 95)
హజారము (యుద్ధ 98)
హుళక్కి (యుద్ధ. 392)
ఉళక్కి (యుద్ధ. 409)

ఉత్వోత్వములతో కూడిన వకారం, యకారం, ఱకారం తెలుగులో పదాదిన లేవు. మహా ప్రాణ వర్ణాలన్నీ తెలుగులో అల్ప ప్రాణాలుగా ప్రయుక్తాలు. శ, ష లు సవర్ణంగా ప్రయుక్తాలు.

ళకారం పదాదిలో లేదు. పదాదిన లకారం మాత్రమే ఉంటుంది
అళుకు (కిష్కింధ. 4)
కళవళము (కిష్కింధ. 22)
కూళ (కిష్కింధ 39)
విరాళి (సుందర. 33)
దాళీలు, దేవళంబులు (సుందర. 34)
గయాళి (సుందర. 95)
త్రుళ్ళు (సుందర. 157)
కౌగిళులు (సుందర. 177)
రవళి (యుద్ధ. 140)
వైళంబ (యుద్ధ. 307)

## పదాలు :

రామాయణం సంస్కృత మహాకావ్యం. కాబట్టి ప్రదేశాలు, నగరాలు, పాత్రల పేర్లు సంస్కృతంలోనే ఉంటాయి. పేర్లు, బిరుదులు మార్చడం తిమ్మకవికి అభిమతం కాదు కాబట్టి అవన్నీ తత్సమ శబ్దాలుగానే ప్రయుక్తాలు.

దశరథుండు (బాల. 18), కౌసల్య, కైక, సుమిత్ర (బాల. 22)
మండోదరి (సుందర. 16)
వసిష్ఠుడు (బాల. 26)
రోమపాదుడు (బాల. 27)
ఋష్యశృంగుడు (బాల. 28)
దూషణుడు (సుందర. 157)
అంగదుడు (యుద్ధ. 447)
కాలనేమి (యుద్ధ. 408)
మాల్యవంతుడు (యుద్ధ. 428)
ధూమ్రాక్షుడు, అకంపనుడు (యుద్ధ. 177)
మహాకాయుడు (యుద్ధ 183)

మొదలైనవి ఉదాహరణలు. కన్నడము వంటి ద్రావిడ భాషల నుండి అరబ్బీ, ఫారసీ వంటి అన్యదేశ భాషల నుండి అరువు తెచ్చుకున్న పదాలు కూడా అచ్చ తెలుగు రామాయణంలో ఉన్నాయి.

హొన్ను (బాల. 61), సాపడి (బాల. 49), తాయి (యుద్ధ. 412), వజీరు (కిష్కింధ. 12), చీనిపనుల (సుందర. 10), హజారము (యుద్ధ. 98), ఫౌజు (యుద్ధ. 128). తేజీ (యుద్ధ. 161). జాకీ (యుద్ధ. 412)

తద్భవాలలో మూలపదంలోని యకారం జకారంగా మారుతుంది.[2]

యక్షులు > జక్కులు (పీ.3)
కార్యము > కర్జము (బాల. 26)
యజ్ఞము > జన్నము (బాల. 32)
యోధ > జోదు (బాల. 44)
యమ > జముడు (బాల. 42)
యోగి > జోగి (అయోధ్య. 64)
శయ్య > సెజ్జ (బాల. 36)
వైద్య > వెజ్జు (బాల. 37)

షకారం సకారమవుతుంది.[3]

భాష>బాస (పి. 10)
సంతోష>సంతస (పి. 15)
దోషము>దోసము (పి. 11)
విషము>విసము (అయోధ్య. 5)
శకారం సకారమవుతుంది.[4]
శయ్య>సెజ్జ (బాల. 36)
యశము>అసము (పి. 9)
శంఖు>సంకు (బాల. 13)
శిఖా>సిగ (పి. 26)
శ్రీ>సిరి (బాల. 4)
దిశ>దెస (అయోధ్య. 42)
శబ్ద>సద్దు (అయోధ్య. 135)
శక్తి>సత్తి (యుద్ధ. 387)
శుక్రుడు>సుక్కురుండు (యుద్ధ. 437)

పద మధ్యంలోనూ, పదాంతంలోనూ 'క్ష' ద్విరుక్త కకారమవుతుంది.[5]

యక్షులు>జక్కులు (పి. 8)
అక్షరము>అక్కరము (పి. 11)
రాక్షసుడు>రక్కసుడు (అయోధ్య. 42)
పక్షి>పక్కి (సుందర. 39)
ఋక్ష>రిక్క (యుద్ధ. 161)

క్ష కారం మరో హల్లుతో సంయుక్తమైనప్పుడు ద్విరుక్త కకారం రాదు.[6]

లక్ష్మి>లచ్చి (అయోధ్య. 34)

ద్వితీయ వర్ణాలు ప్రథమ వర్ణాలుగా, చతుర్థ వర్ణాలు తృతీయవర్ణాలుగా మారుతాయి.[7]

రేఖ>రేక (అయోధ్య. 61)
కథా>కత (పీ. 16)
వృథా>విత (అయోధ్య. 24)
యోధ>జోదు (అయోధ్య. 44)
భీతి>బీతు (అయోధ్య. 72)
గంధము>గందము (అయోధ్య. 141)
భట>బంటు (కిష్కింధ. 14)
భేరి>బేరి (యుద్ధ. 201)
భట్టు>బట్లు (యుద్ధ. 204)

శిఖ, ముఖములకు నిక, మొకములతో నిగ, మొగము అనే రూపాలు కూడా ఉన్నాయి.[8] అంటే ద్వితీయ వర్ణం తృతీయమవుతుంది.

శిఖా>నిగ (పీ. 26)
ముఖము>మొగము (బాల. 36)
చతుర్థ వర్ణం ప్రథమ వర్ణమైన రూపాలు కూడా ఉన్నాయి.
గాథ>గాట (అయోధ్య. 43)
సంయుక్తాలు ద్విరుక్తాలుగా మారతాయి.
వర్ణము>వన్నియ (బాల. 37)
భక్తి>బత్తి (బాల. 63)
భుక్తి>బుత్తి (అయోధ్య. 72)
ముక్తి>ముత్తి (అయోధ్య. 72)
మృత్యువు>మిత్తి (అయోధ్య. 116)
పదాది హల్లుమీది ఉత్వం ఒత్వం అవుతుంది.
గుణము>గొనము (బాల. 22)
కుమారులు>కొమరులు (బాల. 25)
కులము>కొలము (బాల. 37)
పదాది సంయుక్తం అసంయుక్తమవుతుంది.

ప్రజ > పజ (బాల 30)
ప్రయాణము > పయనము (అయోధ్య. 77)
పదాద్యక్షరంలోని ఋత్వం ఎత్వమవుతుంది.
మృగము > మెకము (బాల. 21)
గృహస్థు > గేస్తు (బాల. 21)
సంయుక్తంలోని హల్లుల నడుమ అచ్చు వచ్చిచేరుతుంది.
ముహూర్తము > మూరతము (అయోధ్య. 47)
ము. > ముగుద (బాల. 135)
మూ > మొరకు (కిష్కింధ. 61)
పదా ఋత్వం 'ఱ' గా మారుతుంది.
ఋక్షము > ఱెక్క (బాల. 132)

లోక వ్యవహారంబగు బాస దేశ్యమండ్రు అంటూ, దాన్నే కొందరు అచ్చ తెనుగంటారని చెప్పిన కూచి మంచి తిమ్మకవి తన అభిప్రాయాన్ని చెప్పక పోవడంవల్ల అతని అభిప్రాయంకూడా అదే అనుకోవలసి వస్తుంది. పైగా దీనికి ఉదాహరణ లివ్వవలసిన అవసరాన్ని తిమ్మ కవి గుర్తించలేదు. తిమ్మకవి అచ్చ తెనుగు కృతులే దీని కుదాహరణప్రాయాలేమో, తిమ్మకవి ప్రయోగించిన దేశ్య శబ్దాలు కొన్ని ఈనాడు జనవ్యవహారంలో అంతగా కనిపించక పోవచ్చు. కాని బహుళ సంఖ్యాకమైన శబ్దాలు ఆంధ్రదేశమంతటా వ్యవహారంలో ఉన్నాయి.

లిబ్బి గుబ్బెత (యుద్ధ. 592) లిబ్బి అంటే రాశి అనే అర్థంలో నేటికీ వామనగుంటల ఆటలో ప్రయోగం ఉంది. వామి అన్నది గడ్డివామి అని నేటి ప్రయోగం. తిమ్మకవి నీర్వామి (కిష్కింధ. 90) అని ప్రయోగించాడు. టక్కు (సుందర. 47) వంచన అన్న అర్థంలో, త్రుళ్ళు (సుందర. 157) పొగరు అన్న అర్థంలో తిమ్మకవి ప్రయోగించాడు. లకోరి (యుద్ధ. 74) బాణార్థకం. ఈద (యుద్ధ. 147) గాలి అనే అర్థంలో, ఉపయోగించాడు. ఈదర గాలి అని నేటి వ్యవహారం. అజుజు రూపు (యుద్ధ. 417) చిన్న రూపము అనిఅర్థం. అజు జూ-తూలు అన్న పదాలు గృహావధకాలలో జ్యోతిష్కులు, ఉప్పరి పని వాళ్ళు అడ్డం-నిలువు అన్న అర్థంలో వాడుతున్నారు.



వైశంబ (యుద్ధ. 307) = వేగం.
సింగాణి (సుందర. 83) = ఒక విధమైన విల్లు సింగిణి.
గొంకు (అయోధ్య. 67) = శంక
లొచ్చు (కిష్కింధ. 23) = లోటు
ఇబ్బడి (కిష్కింధ. 45) = రెండింతలు
దూప (కిష్కింధ. 62) = దాహం. నేటికీ తెలంగాణాలో ప్రయోగంలో ఉంది.
వెట్ట (కిష్కింధ 67) = వేడి
సిదము (పీ. 22) = చిహ్నము
బేహారి (అయోధ్య. 21) = వ్యాపారి.

ఎకిమీడు (అయోధ్య 58), కలను (పీ. 1), వాయి (పీ. 11), తత్తడి (పీ 13), జియ్య (పీ. 8), విన్ను (పీ. 6), అంగద (కిష్కింధ. 60), వ్రేగు (కిష్కింధ. 17), తీగ (అయోధ్య. 134), డిగ్గియ (బాల. 67) మొదలైనవి ప్రసిద్ధాలు.

## సంధి :

అచ్చతెలుగు రామాయణంలో సంస్కృత సంధులకవకాశం లేదు. తత్సమ శబ్దాలు కేవలం సంజ్ఞావాచకాలకు మాత్రమే పరిమితం కాబట్టి ధూమ్రాక్షుడు (యుద్ధ. 177) వంటి అతి పరిమితమైన పదాలలో తప్ప సంధి రూపాలుండవు. పేరే సమాసంగా ఉంటే తప్ప రెండు పదాలు కలిసిన తత్సమ పద రూపాలు ఈ గ్రంథంలో సాధ్యం కావు.

తెలుగు సంధి ప్రధానంగా అచ్సంధి. రెండచ్చులు వరుసగా ప్రయుక్తం కావడం తెలుగులో సహజం కాదు. కాబట్టి వాటిలో ఒక అచ్చుకు లోపం చేయడమే సంధి. లోపం చెందే అచ్చు పూర్వాచ్చు. పూర్వస్వరం ప్రధానమయినపుడు సంధి జరగదు. అంటే పూర్వాచ్చు లోపించదు. అటువంటి సందర్భాలలో సంధిని, ప్రకృతి భావాన్ని నిరోధించడం కోసం యడాగమం వస్తుంది. ద్రుత ప్రకృతిక సంధి, పుంప్వాదేశం, ప్రాతాది సంధులు హల్సంధులు. లాక్షణికుడైన కూచిమంచి తిమ్మకవి రచనలో సంధి ప్రక్రియ లక్షణ యుక్తమే.

తిమ్మకవి లక్షణ సారసంగ్రహంలో ఇత్వ, అత్వసంధులను వికల్ప సంధులుగా చెప్పి మహాకవి ప్రయోగాలను ఉదహరించాడు. అచ్చతెలుగు రామాయణంలో కూడ ఇవి వికల్పసంధులుగానే ప్రయుక్తాలు.

తెల్లని యిల్లాలు (పీ. 5)
మరునయ్య (పీ 1)
వాడియమ్ములు (సుందర. 119)
చేతి యుదుటువిల్లు (బాల. 181)
చేరి చెలిమి (బాల. 136)
చనిరొయ్యన (బాల. 135)
జక్కుల యెకిమీడు (బాల 159)
కమ్మ యిడుట (బాల. 162)
ప్రోలి కేగినట్టి (సుందర. 116)
చూపకుండినన్ (అరణ్య. 105)
మోచుకయుండు (సుందర. 41)

వర్తమానార్థ విహితమైన చువర్ణానికి సంధి వైకల్పికం[10]

అరుగుచునొక్కటో (అరణ్య 116)
పలుకుచున్న (సుందర. 57)
పొగడుచునతడు (అరణ్య. 115)
పొగులుచున్న (కిష్కింధ. 70)
చనుచున్న తరిన్ (అరణ్య. 109)
కర్మధారయంలో టుగాగమం.[11]
మిన్కుటులివులు (బాల. 93)
అముటేనుగు గున్న (బాల. 151)
తూఁగుటుయ్యాలలు (బాల. 168)
కరకుటమ్మున (అరణ్య. 14)
చిగురుటాకు (అరణ్య. 22)
నిల్వుటద్దము (బాల. 9)

కొమ్మ చేనుగు (బాల. 8, 138)
కర్మధారయంలో పుంప్వాదేశం
కుందనపు బొంగరముల (బాల. 55)
రతనంపు మొలత్రాళ్ళ (బాల. 61)
సింగపుపీట (బాల. 63)
పుంప్వాదేశమూ, టుగాగమమూ
గాటంపు టదవుల (బాల. 37)
జన్నపుటిల్ (బాల. 90)
అబ్బురపుటింతి (బాల. 110)
క్రొవంపుటనటి (బాల. 113)
గడితంపుటుఱుము చప్పుడులు (బాల. 138)
రతనంపుటువ్వరిగ (పీ 1)

గజడదబములకు ముందు పొల్లు హల్లు నిలుస్తుంది. లేకపోతే పూర్ణ బిందువవుతుంది.[12]

తెగుతలలు మొలచు తలలుం
దిగువంబడు తలలు మొగిలు తెరువునకు వడి
న్నెగయు తలలవ్వ డబ్బుర
మగుచున్ జగమంత్రగాని యాటయబోలెన్ (యుద్ధ. 549)
వగలన్ బొక్కెడు తన చెలిఁగనుఁగొని (యుద్ధ. 459)
పెన్ గాలికి (యుద్ధ 469)
తొలియచ్చు మీది వర్ణాల లోపానికి
లేనెల (పీ. 1)
క్రొవ్విరిసరములు (అయోధ్య. 13)
స్వరం లోపించి మీది హల్లుతో సంయుక్తం కావడానికి
మేల్జాళువా (బాల. 61)
తొల్పందిగున్న (బాల. 167)
బల్మన్నియ (బాల. 128)
మేల్తెరంగెల్ల (బాల. 140)
పరుషాలు సరళాలు కావడానికి

కెందామర (పీ. 11.)
కేలుదామర (బాల. 61)
కెంజాయ (అయోధ్య. 13)

ఉదాహరణలు. లుప్తశేషానికి ద్విత్వం రావడానికి ఈ క్రింది ప్రయోగాలు ఉదాహరణలు.

ముజ్జగములు (పీ. 1)
ముయ్యేడు మారులు (బాల. 175)
క్రొన్నెలరాజ జడదారి (బాల. 150)

## సంఖ్యావాచకాలు :

అచ్చతెలుగు రామాయణంలో సంఖ్యావాచకాలు విశేష్యాలుగానూ విశేషణాలుగానూ ప్రయుక్తమయ్యాయి. సంఖ్యావాచక శబ్దాలలో ఈ గ్రంథంలో వాడిన వాటిలో వేయి గరిష్ఠ సంఖ్య. లక్ష, కోటి తత్సమాలు కాబట్టి వాడలేదు.

ఒక్కకొండఱు (బాల. 148) ఒక్కటి (యుద్ధ. 333) ఒండు (యుద్ధ. 555)

అవ పూరణార్థకం.

రెండవ, మూడవ, నాలుగవ (బాల. 58)
తొమ్మిదియవనాట (బాల. 58)
ఆఱునొండవ రిక్క (బాల. 58)
పదునాకొండవ పట్టున (బాల. 59)

మానవ వాచకంగా

ఇర్వురు (అరణ్య. 35)
మువ్వురకు (బాల. 48) నల్వురకును (బాల. 59)

విశేషణంగా రెండుకు 'ఇరు,' 'ఈర్'

ఈరైదు కుత్తుకలు (బాల. 131)

మూడుకు 'ము'

ముజ్జగములు (బాల. 41)

నాలుగుకు 'నల్'

నల్దెరగులు (బాల. 46)

రెండు, మూడులకు దుగ, తిగ అని ప్రయోగించాడు. ఇవి ప్రాకృత భవాలు.

ఇరుదుగ రూపులూని (బాల. 156)

దుగ తిగ తీపారు తూపు దొర (బాల. 112)

ఏడునకు 'సత'

సతనాల్కల జేజే (బాల. 48)

దుగ, తిగ, సత్తా అనేవి మన పచ్చీసు ఆటలో నేటికీ వాడుకలో ఉన్నాయి. ఏడు రోదన సంఖ్య అని తిరస్కారం. అందుకే ఏడు అనకుండా ఆరునొండవ రిక్క (బాల. 58) అని ప్రయోగించాడు.

నాలుగుకు పర్యాయరూపంగా 'తీవంచ' ప్రయోగించాడు.

తీవంచ వార్వంపుటగ్గిపట్ల నడుమ (బాల. 158)

ఐదుకు పర్యాయ రూపంగా 'చౌవంచ' ప్రయోగించాడు.

చౌవంచ మట్టుల కోన (యుద్ధ. 22)

పది, బంతి, చాల్పు సమానార్థకాలుగా ప్రయుక్తాలు.

పదితలల రక్కసుల ఱేడు (బాల. 41)

బంతి తలల రక్కసుడు (బాల. 42)

చాల్పు తేర్ల దొరను (బాల. 20)

ఐదు నూఱు కేల్గవలును (బాల. 175) లో నూఱు శబ్దం ప్రయుక్తం.

వేసుద్దులివేటికి (బాల. 145) లో వేయి శబ్ద విశేషణరూపం ప్రయుక్తమయింది.

జనకుడు 'వేయి నూఱారుల ఔక్కముల్' (బాల. 170) దానం చేశాడట. పర్యాయంగా పదినూర్లు. పదినూళ్ల తత్తడల్యానినట్టి (యుద్ధ. 184).

కూడికలు, హెచ్చవేతల ద్వారా సంఖ్యలను తెల్పడం ఒక సంప్రదాయం. అచ్చతెలుగు రామాయణంలో ఇటువంటి ప్రయోగాలు విశేషంగా లభిస్తాయి.

ఇరు చౌవంచ యొౌదలల రక్కసిరాయని (యుద్ధ 17) $2\times5=$
జమిలి చౌవంచ తేర్ల రాచలివెలుగునకు (బాల. 156) $2\times5=10$
ముయ్యేడు మారుల (బాల. 130, 175) $3\times7=21$
ఇరుదుగ రూపులూని (బాల. 156) $2\times2=4$
దుగతిగ తీపారు తూపుదొర (బాల. 112) $2+3=5$
ఈ రైదు కుత్తుకలు (బాల. 131) $2\times5=10$
రెండు తొమ్మిదులు (యుద్ధ. 331) $2\times9=18$
పదియారు వదుల (యుద్ధ. 192) $16\times10=160$
ఈరే న్గొంతుకల (యుద్ధ. 183) $2\times5=10$
జంట చవువంచకడలును (యుద్ధ. 184) $2\times5=10$

## విభక్తి ప్రత్యయాలు :

నామ విభక్తులు నామానికి ఉండే అర్థాన్ని మార్చడానికి ఉపయోగపడ తాయి. నామవాచకానికీ, క్రియకూ మధ్య ఉన్న సంబంధాన్ని బోధిస్తాయి విభక్తికి ఉండే అర్థాన్ని కారకం అంటారు. కారకం నామానికి క్రియకు మధ్య ఉండే అన్వయం. కారకాలు అర్థాలు. అంతరంగ నిర్మాణానికి సంబ ధించినవి. విభక్తులు ఈ అర్థాలను సూచించేవి. బాహ్య నిర్మాణంలో వి

విభక్త్యర్థం కొన్ని భాషల్లో ప్రత్యయాల ద్వారా, మరికొన్ని భాష అనుబంధ పదాల ద్వారా వ్యక్తమవుతుంది. ఈ అనుబంధ పదాలు నామవా కానికి ముందు చేరేవి, తరువాత చేరేవిగా కూడా ఉంటాయి. తెలుగులో విభ ప్రత్యయాలుగా భావించేవి చాలా వరకు అనుబంధ పదాలే. ఇవి నామవా కానికి తరువాతే చేరతాయి. సంస్కృతాంధ్ర వ్యాకర్తలు ఆరు కారకాల్ని కారకాలను బోధించే విభక్తి ప్రత్యయాల్ని వివరించారు. కాని ఒక కారకాని ఒక విభక్తి ప్రత్యయం అన్న నియమం నిర్దిష్టంగా లేదు. కారకాల సంఖ్యా విభక్తుల సంఖ్యా నిర్ణీతాలు కావు. ఒక విభక్తి ప్రత్యయం లేదా అనుబం పదం అనేకార్థాలను బోధించవచ్చు.

సంస్కృతంలో 'స్థాల్యాంపచతి', 'స్థాలీపచతి' అనే వాక్యాలు భిన్న విభక్తి ప్రత్యయాలను కలిగి ఉన్నా ఒకే అర్థాన్ని బోధిస్తున్నాయి. హిందీల

'సే' తృతీయా పంచమీ విభక్త్యర్థాలలో, 'కో' చతుర్థీ, షష్ఠీ విభక్త్యర్థాలలో ప్రయుక్తమవుతున్నాయి. సంస్కృతంలో రెండు మూడు సంబంధాలను బోధించడానికి ఒకే విభక్తి ప్రత్యయం వాడుకలో ఉంది తెలుగులో కూడా ఒకే సంబంధాన్ని బోధించడానికి ఒకటికంటే ఎక్కువ అనుబంధ పదాలు లేక ప్రత్యయాలు. ఒకటి కంటే ఎక్కువ సంబంధాలను బోధించడానికి ఒకే ప్రత్యయం లేదా అనుబంధ పదం కనిపిస్తాయి. సంప్రదాయ వ్యాకరణాలలో అనుబంధ పదాలను కూడా విభక్తి ప్రత్యయాలుగానే గుర్తించారు.

తిమ్మకవి 'లక్షణ సారసంగ్రహము' లో విభక్తి ప్రకరణంలో తెలుగులో విభక్తి ప్రత్యయాలు ప్రయుక్తమవుతున్న తీరును వివరించాడు. ప్రథమా విభక్తి అమహదేక వచనంలో ము, మ్ము, ంబు, వులు ప్రయోగించాడు.

కర్ణంబు (అరణ్య. 105)
కొత్తడంబులు (సుందర. 8)
తానకము (అరణ్య. 4)
మానికము (అరణ్య. 20)
రాచపుట్టువు (అయోధ్య. 104) రఘువు (అయోధ్య. 58)
అబ్రమ్ము (కిష్కింధ. 94)
మహదేకవచన ప్రత్యయంగా 'ఁడు', 'ండు' ప్రయుక్తమయ్యాయి.
హనుమంతుఁడు (సుందర. 75)
అంగదుండు (యుద్ధ. 189)
ప్రథమ బహువచన ప్రత్యయాలుగా 'లు' 'రు' 'ండ్రు', 'ళ్ళు' ప్రయుక్తమయ్యాయి.
వూజలు (అరణ్య. 3) మోములు (యుద్ధ. 186)
నడలు (అరణ్య. 26) బొమ్మలు (యుద్ధ. 180)
మువ్వురు (అరణ్య. 15)
వాండ్రు (అరణ్య. 15) సంగడికాండ్రు (అయోధ్య. 62)
మీగాళ్ళు (అరణ్య. 26)
ద్వితీయకు ప్రథమ రావడానికి

ముస్నిటి నడు దీవి యేలు జేడ (అరణ్య. 57) సంద్రము లొక్క మాటె యింకింతునొ (అరణ్య. 106)

తృతీయకు మారుగా ప్రథమ రావడానికి

ఒక కోల వాని తలఁ దెగనేసెన్ (అరణ్య. 5)

సప్తమికి బదులుగా ప్రథమ రావడానికి

అగ్గి సొచ్చి వెదలుదాన (యుద్ధ. 576)

**ఉదాహరణలు.**

ద్వితీయా విభక్తి ప్రత్యయంగా 'న్' ప్రయుక్తం. ఇత్వ, ఉత్వ విశిష్ట నకారం కూడా ద్వితీయాప్రత్యయమే.

పూజన్ (అరణ్య. 6)

సంగడి చేడియలను (యుద్ధ. 587)

నిన్నున్ (అయోధ్య. 74)

ముత్తయిదువ పోఁడిమిని (అయోధ్య. 73)

మగవానిన్ (అరణ్య. 10)

తృతీయకు బదులుగా ద్వితీయ

పేరఁబరగువాడ (అరణ్య 57) కినుకన్ (అరణ్య. 14)

సప్తమికి ద్వితీయ

ప్రాలని బలు దీవింగేరెడు నీకు (అరణ్య. 32)

తృతీయా విభక్తి 'చేతన్'

రక్కసుని చేతననదనై చిక్కువడితి (అరణ్య. 67)

కార్ముకంబుల చేతఁబొలిసెనో (అరణ్య. 85)

'చేన్'

మేలువన్నియ పొట్టవేలుపు మిన్నచేఁ గదలేని మెప్పులు గాంచినాడ (అరణ్య. 58)

'తోడన్'

చిలుక కూటువుల తోడఁదొడరు (అరణ్య. 26)

అనినఁదొయ్యలి తన తెఱఁగతని తోడనంతయును జెప్పి (అరణ్య. 56)

'తోడ'

తమ్మి వేదూండ్లతోడ (అరణ్య. 26)

బేడిసమీలతోఁద (అరణ్య. 26)
'తోన్'
కొదమ తాబేళ్ళతోన్ (అరణ్య 26)
ఉడివోవని కొఱకొఱతోన్ (కిష్కింధ - 42)
'తో'
రామునితో మచ్చిక వెలయంగఁ దియ్యమాటలు పలికెన్ (కిష్కింధ-17)
పాలతో నును మగఱాలతో (అరణ్య. 26)
'తోన' సహార్థంలో
ఆ వింటితోన యాతని లావును నెఱతనము తేజు లాగుకొని
(బాల. 182)
తృతీయార్థంలో సప్తమి
మెత్తదనమున నొసగిన (అరణ్య. 57)
కఱకుటమ్మునన్ (అరణ్య. 14)
చతుర్థీ విభక్తి ప్రత్యయం 'కొఱకు'
వంటపైదలి కొఱకు (యుద్ధ. 64)
నేతికొఱకు వెన్నపై నగ్గి సందేఁడు ద్రేయఁజనునె (అయోధ్య. 26)
పుడుకుల కొఱకప్పుడు (అయోధ్య. 17)
వెన్నుఁడిజ్జగమెల్లఁబ్రోచు కొఱకుఁబెక్కురూపులూని (యుద్ధ. 464)
మేల్సమకూర్చుటకొఱకుఁగాదెచనుదెంతురు (బాల. 154)
'కై'
అవ్వెలందికై (అరణ్య. 37)
తెరవకై (అరణ్య. 103)
ఆపెకై వలగొని (కిష్కింధ. 9)
చతుర్థ్యర్థంలో షష్ఠి 'కి'
తూఁగుటుయ్యేలలు మందసలునునయ్యల్లు వారి కొసంగి (బాల. 168)
పంచమీ విభక్తి ప్రత్యయం 'కంటెన్'
వేల్పురాయనికంటెను, జమునికంటె, నీళ్ళసామికంటె (యుద్ధ. 118)
'వలన'
నెత్తురు ద్రావుడుల వలన (యుద్ధ. 196)

అగ్గివలన బమ్మతూపుగాంచి (యుద్ధ. 269)

'కన్నన్'

రావణుకన్నన్ బలియుండు కుంభకర్ణుఁడు (యుద్ధ. 69)

'క్రోలె'

గైకొనివచ్చిన గోలె (సుందర. 81)

సంబంధ షష్ఠీ ప్రత్యయాలు 'కిన్', 'కున్'

అయ్యింతికి (అరణ్య. 42)

దొరలిపాలికిన్ (అరణ్య. 12)

నీకుం దగువాఁడు (అరణ్య. 10)

అలంబునకున్ (అరణ్య. 12)

'లోన' నిర్ధారణ షష్ఠి.

వెలయ నిరుదచ్చిరాచ జాబిలులలోన మిక్కుటంబగు తేజున మెఱసి నాఁడ (బాల. 175)

షష్ఠీ విభక్తి ప్రత్యయాలు లోపలన్, లోపల, లోనన్, లోన, లోన్, లో సప్తమ్యర్థంలో కూచిమంచి తిమ్మకవి ప్రయోగించాడు నిర్ధారణార్థంలో వీటి ప్రయోగం తక్కువగానే జరిగింది.

అంతలోపలఁ దెప్పిరి యంగదుండు రక్కసునిఁ గేల నడిచిన (యుద్ధ. 455)

ఏకిమీడుల నెద నమ్మఁగ వచ్చునె కలలోపలనైన (అయోధ్య. 33)

వలవదెన్నఁడు నీళ్ళలోపల మునుంగ (అయోధ్య. 54)

మేలియపరంజి పనికొల్పు మేడలోనన్ (యుద్ధ. 563)

తేని యడుగులు డెందమ్ములోన నిలిపి (యుద్ధ. 578)

అళుకేలలేదు మదిలోన్ (అరణ్య. 98)

తాఁబేలు కడుపులోఁ దలఁగ్రుక్కుకొనియె (అరణ్య. 22)

పెనుకువలో రాముని గెలుతుననెడు తలఁపులు (యుద్ధ. 462)

'లో'కు వ్యస్తంగా కూడా తిమ్మకవి ప్రయోగం కనిపిస్తుంది.

పడఁదన్ని లోనికేఁగి కడంకన్ (యుద్ధ. 445)

సమాసంలో పూర్వపదంగాకూడా 'లో' ప్రయుక్తమయింది.

గడుసరి తొలివేల్పు లోనగరు దూటి (యుద్ధ 446)

'అందు' 'న' సప్తమీ విభక్తి ప్రత్యయాలు. సప్తమ్యర్థంలో షష్ఠీ విభక్తి ప్రత్యయాల ప్రయోగాన్ని పైన గమనించాం అన్, ఇన్‌లు కూడా సప్తమ్యర్థాన్ని బోధిస్తాయి

ముజ్జగంబుల యందున్ (అరణ్య. 1)

ఏ రాకన్నియల యందున్ (అరణ్య. 18)

పెను జక్కరలయందుమునిగెనో (అరణ్య. 85)

'అన్'

నా యింటఁ గొదవలేక (అరణ్య. 59)

సిరులచెలి మగని యడుగనఁగరమరుదుగ (అరణ్య. 1)

నెత్తురులఁదోగి (అరణ్య. 12)

'ఇన్'

అబ్బలు మగని తూపుటగ్గిం దొలివేలుపు వంగడంబు ద్రుంగెడుఁజూమ్మీ (అరణ్య. 71)

అడవింజనుచో (అరణ్య. 46)

'న'

మనికి పట్టున ననయంబు నునిచినాఁడ (అరణ్య. 58)

'అను'

మొగిలు త్రోవను (అరణ్య. 119)

తీవియబోడి క్రేవలను (అరణ్య. 37)

కనుగొనులను నిప్పులొలుక (అరణ్య. 45)

పంచమ్యర్థంలో సప్తమి. అపాదాన కారకం.

అత్తావునఁ దరలి (సుందర. 24)

సంబోధన ప్రథమా విభక్తి రూపాలు అచ్చతెలుగు రామాయణంలో విస్తారంగా కనిపిస్తాయి.

'అ'

రాయడ! (అరణ్య. 34)

భోజుంగ! (అరణ్య. 1)

'ఆ'

వేల్పులగొంగా! (అరణ్య. 1)
కోడలా! (అయోధ్య 98)
కైకా! (అయోధ్య. 95)

'ఇ'

తండ్రి! (అయోధ్య. 66)

'ఈ'

విడిపింపరాగదవె వంటచెలీ! (అరణ్య. 66)

'ఆర' బహువచనంలో.

జేడులార! మెకంబులార! చెట్టులార! గుడ్డికాన్పులార (అరణ్య. 65)

'రా'

ఏనుంగురా! (అరణ్య. 90)
క్రొన్నన బోడిరా (సుం. 38)

సంబోధన పదాలుగా ఓ, ఓరి ప్రయుక్తమయ్యాయి.

ఓ చెలియలా! (అరణ్య. 66)
ఓ లక్ష్మణుడా! (అరణ్య. 45)
ఓ వలంతి! (బాల 124)
ఓ తల్లి! (అరణ్య. 66)
ఓ గొరమల ప్రోకలార! (యుద్ధ. 56)
ఓరి దోసకారి! (అరణ్య. 69)

'కాన'

ఓరి వెదంగు ప్రాన్మనికి యొంటరికాన! (యుద్ధ. 101)
ఓరి కి విడిగా కూడా ప్రయోగం.
ఓరి! తమ్ముడవయ్యు (యుద్ధ. 36)

## సమాసాలు :

సమాసం అనేపదమూ, సమాస ప్రక్రియా ఆంధ్రశబ్ద చింతామణినుండే తెలుగులో కనపడుతూ ఉంది. చింతామణిలో సమాసాన్ని నిర్వచించలేదు,

సమ్ అనే ఉపసర్గ పూర్వకమైన 'అస్' ధాతువుకు భావార్థంలో 'ఘఞ్' ప్రత్యయంచేరి 'సమాసం' ఏర్పడుతోంది. సమసనం సమాసః, అనేక పదాలకు ఏకభావరూపమైన సంశ్లేషం సమాసం సామర్థ్యంతో కూడిన పదవిధే సమాసం.[14]

తొలి తెలుగు వ్యాకరణం ఆంధ్రభాషాభూషణంలో "మొదలి పదంబు విభక్తులఁబుచ్చి మీది పదంబులతోడ సమ్యక్సంసక్తంబులగుటంజేసి సమాసంబులయ్యె" అని కేతన సమాసాన్ని నిర్వచించాడు. లక్షణసార సంగ్రహంలో కూచిమంచి తిమ్మకవి సమాస ప్రకరణంలో సమాస శబ్దాన్ని నిర్వచించనేలేదు. అప్పకవి సమాస ప్రకరణం వరకు రానేలేదు.

చిన్నయసూరి 'సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసంబు'[15] అని నిర్వచించాడు కాని సమాస భేదాలను 'తత్పురుషాదులకు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబయగు'[16] అని నిర్వచించాడు. తెలుగులో సమాస నిర్వచనానికి సమాసభేదాల వర్గీకరణకు తెలుగుభాషా సహజమైన రీతిలో పూర్వలాక్షణికులు ప్రయత్నించినట్లు కనిపించదు. సంస్కృత వ్యాకరణాల మార్గంలోనే తెలుగు సమాసాన్ని వివరించే ప్రయత్నం చేశారు.

తమిళ వ్యాకరణాలలో సమాసాల పేర్లను తమిళంలోకి మార్చుకున్నారు. తెలుగు, కన్నడం,మళయాళాలలో సంస్కృత నామాలనే స్వీకరించారు. కేతన పూర్వ పదార్థ ప్రధానము, ఉత్తర పదార్థ ప్రధానము, ఉభయ పదార్థ ప్రధానము, అన్యపదార్థ ప్రధానము అని నాలుగు విధాలుగా సమాసం ఉంటుందని నిర్వచనాత్మకమైన విభాగాన్ని స్వీకరించాడు. కూచిమంచి తిమ్మకవి కర్మధారయం, తత్పురుష సమాసాలను మాత్రమే పేర్కొన్నాడు. తెలుగు సంస్కృత పదాలను కలయగూర్చి చెప్తే మిశ్ర సమాసం అంటారని పేర్కొన్నాడు. "అన్యేచ కేచిదుపమానోత్తర పదలోప రూపకాఖ్యాద్యాః పరిదృశ్యాః" అని రూపక సమాసాదులను ఆంధ్రశబ్ద చింతామణి పేర్కొన్నది. చిన్నయసూరి మరో విధమైన విభాగం చేశాడు. సాంస్కృతికం, అచ్ఛికం, మిశ్రం అని మూడు విధాల విభాగం చేశాడు. కేవలం తెలుగు పదాలతో నిర్మించిన సమాసం అచ్ఛికం.

తెలుగు సంయుక్త పదరూపభాష. మనం చెప్పుకున్న నామ విభక్తి ప్రత్యయాలు ఎక్కువ భాగం ప్రత్యేక పదాలే అందువల్ల పదమూ + విభక్తి ప్రత్యయము కూడా సమాసమే అవవలసి వస్తుంది. విభక్తి ప్రత్యయమే లేనప్పుడు విభక్తి లోపం కూడా అర్థరహితమే అవుతుంది. తెలుగులో ప్రథమా రూపాలు సాధారణంగా ప్రత్యయ రహితాలు అందుకే వ్యాకర్తలు వాటిని త్రిసమాలు, క్లీబతుల్యాలు అని పేర్కొన్నారు. ఇటువంటి సందర్భాలలో విభక్తి ప్రత్యయాన్ని విధించి లోపం చెప్పవలసి వస్తుంది ప్రక్రియకోసం. 'కేవల వికృతి వర్యత్సమాసకం తంబ్రువంతి వాక్యజ్ఞాః' అని ఆంధ్రశబ్ద చింతామణి సమాసం అనే మాటను ప్రయోగించింది చిన్నయసూరి అచ్చికం అని చెప్పింది దీనినే ఈ పదంలో 'కప్' ప్రత్యయం అల్పార్థంలో వచ్చి ఉంటుంది. తెలుగు సమాసం అల్పాక్షరాలతో ఏర్పడుతుందని సూచన కావచ్చు. తెలుగులో దీర్ఘ సమాస నిర్మాణానికి అవకాశం లేదు. ఏక సమాసంగా పద్య రచన సాధ్యం కాదు. సమాసం తెలుగులో రెండు మూడు పదాలకు మాత్రమే పరిమితం. అంతకంటే ఎక్కువ పదాలతో నిర్మించిన సమాసం కృతకమే తప్ప సహజం కాదు.

తెలుగు వ్యాకర్తలు సంస్కృత శబ్దాలతో తెలుగు శబ్దాలు కలిసి ఏర్పడే సమాసాలను మిశ్రసమాసాలు, వైరిసమాసాలు అని రెండు రకాలుగా చెప్పారు. మిశ్రసమాసాలను అంగీకరించారు. వైరిసమాసాలను అంగీకరించలేదు. మిశ్రసమాసాలలో పూర్వోత్తర పదాలలో ఒకటి తత్సమం, మరొకటి దేశ్యం. రామునానతి వంటివి ఉదాహరణలు. ఈ సమాసంలో రెండు పదాలకూ తెలుగు విభక్తులతో విగ్రహ వాక్యం చెప్పవచ్చు వైరిసమాసంలో తెలుగు విభక్తులతో విగ్రహ వాక్యం చెప్పడానికి వీలుండదు క్షీరార్ణవకూతురు వంటి విందుకుదాహరణలు.

కేతనాదులు దినకరకొడుకు, అల్పదండు వంటి సమాసాలను నిషేధించారు. నీ, నా, తన పదాలు సంస్కృత పదాలతో సమసిస్తాయని కేతన అంగీకరించాడు తిమ్మకవికూడా

> తన నా నీ యను పదముల
> కొన సంస్కృత శబ్ద వితతిఁగూర్చి సమాసం
> బొనరింపఁ జెల్లుఁ గృతులన్
> దనపతి సన్మిత్ర! కరటి దానవ జైత్రా!17

అని చెప్పాడు.

అచ్చ తెలుగు రామాయణంలో సాంస్కృతిక సమాసానికి అవకాశం చాలా తక్కువ. పేర్లు బిరుదులు మాత్రం మార్చనని చెప్పాడు కాబట్టి వాటిలో సాంస్కృతిక సమాసాలు సాధ్యమే. ఇతరత్రా సాధ్యం కావు ఉదాహరణకు రోమపాదుడు, ఋష్యశృంగుడు. తత్సమం పనికిరాదు కాబట్టి మిశ్ర సమాసం అసలే సాధ్యం కాదు. కేవలం ఆచ్ఛిక సమాసం మాత్రమే ప్రయుక్తం కావడానికి అవకాశం ఉంది.

ఆచ్ఛిక సమాసంలో సమాస మధ్యకార్యాలు, సమాసాంత కార్యాలు స్వల్పమే. బహువ్రీహి సమాసంలో వ్యవహారసిద్ధాలైన ముక్కంటి, వేవెలుగు, మోటబరి వంటివి మాత్రమే పరిమితంగా కనిపిస్తాయి.

రచన అచ్చ తెలుగులో జరిగినా మూల కావ్యం సంస్కృతం కాబట్టి అనేకానేక పదబంధాలు భావాలు సంస్కృత భాషా సహజాలై ఉంటాయి. వాటిని తెలుగులోకి తెచ్చుకోవడంలో కవికి అనేక ఇబ్బందులు ఎదురౌతాయి పైఛందోబంధనాలు ఈ ఇబ్బందులను ఇబ్బడిముబ్బడి చేస్తాయి బిరుదులు, పేర్లు సంస్కృతంలోనే ఉంచుతానని చెప్పిన కవి కావ్యమంతటా ఆ సూత్రాన్ని పాటించనే లేదు. పేర్లనూ, బిరుదులనూ అనువదిస్తూ పోయాడు. సంస్కృతంలో ఈ పేర్లు. బిరుదుల విషయంలో చూపించిన వైవిధ్యాన్ని తెలుగులోనూ చూపించాలన్న కుతూహలం దీనికి ఒక కారణం కావచ్చు. ఈ వైవిధ్య ప్రదర్శనా యత్నంలో సహజత్వం దెబ్బతిని, కృతక సమాస నిర్మాణం విస్తారంగా పెరిగింది ఇది అచ్చతెలుగు కవులు మాత్రమే చేసిన పని కాదు గాని ఈ అవసరం అచ్చతెలుగు కవులకు కలిగినంతగా తక్కిన కవులకు కలగలేదు. తక్కిన కవులకిది చమత్కారం మాత్రమే అచ్చతెలుగు కవులకు అనివార్య విధి.

'A study of Telugu Compounds' లో జాస్తి సూర్యనారాయణ సంస్కృత సమాసాలనూ తెలుగు పదబంధాలనూ విస్తృతంగా పరిశీలించారు. ఆయన కొన్ని తెలుగు సమాసాలను ఆభాస సమాసాలుగా పేర్కొన్నారు. అచ్చతెలుగు కావ్యాలలో సమాస కల్పనం మూడు విధాలుగా ఉంటుందని సూర్యనారాయణ విశ్లేషించారు.

1) సంస్కృత సమాసంలోని సుబాది ప్రత్యయాల అర్థాన్ని వివరిం దానికి తెలుగు పదబంధ నిర్మాణంలో పదాంతరం అవసరమవుతుంది.

ఉదా : కప్పుకుత్తుక వాడు (పీ 15)
గిత్త తత్తడి వాడు (పీ. 18)
వెంట్రుకయడుగుల దొర (బాల. 28)
మనుబోతు కొమ్ము తపసి (బాల 29)
పచ్చవారువపు జోదు (పీ. 3)

పై సమాసాలు వరుసగా నీలకంఠ, వృషభవాహన, రోమపాద, ఋష్య శృంగ, హరిదశ్వ అనే సంస్కృత సమాసాలకు తెలుగు అనువాదాలు. ఆ సమాసాలలోని సుప్ప్రత్యయాలకు బదులుగా తెలుగు సమాసాలలో వాడు, దొర, తపసి, జోదు ప్రయుక్తమయ్యాయి. వీటిని బహువ్రీహి సమాసాభాసా లుగా సూర్యనారాయణ భావించారు.

2) పై ప్రక్రియను తద్ధితాలను అనువదించుకున్నప్పుడు కూడ అవ లంబించారు.

వలిగుబ్బలి రాచ కూతురు (పీ. 15)
పుట్ట బుట్టువు తపసి (పీ. 9)
పదియరదముల దొర కొడుకు (పీ. 9)

ఈ సమాసాలు వరుసగా హైమవతి, వాల్మీకి, దాశరధి అనే తద్ధిత రూపాలకు అనువాదాలు. ఈ తద్ధితాలలోని అపత్యార్థాన్ని బోధించడానికి కూతురు, తపసి, కొడుకూ ఉపయోగపడ్డాయి సంస్కృత పద్ధతిలో ప్రత్య యాలుగాని, సమాస విధిగాని ఇక్కడ లేదని గ్రహించవచ్చు.

3) మగవాడు,ననబోడి మొదలైనవి తెలుగులో ప్రాథమిక సమాసాలు. స్త్రీ పురుష వాచకాలుగా సమస్త రూపాలుగా వాడుకలో ఉన్నాయి.

కర్మధారయాదులను కూడ పై బహువ్రీహి సమాసాలులాగా ఆభాస సమాసాలుగా అనువాదాలలో గుర్తించవచ్చు.

సంస్కృతంలో పూర్వపద విభక్తి ప్రత్యయం లోపించని సమాసాలు అలుక్సమాసాలు. ఈ ప్రక్రియ అన్ని విభక్తులలోనూ ఉంటుంది. తెలుగులో పూర్వ పదానికి విభక్తి ప్రత్యయం లోపించినా ఏక, బహువచన సూచకాలయిన ని, లు లోపం జరగదు. చిన్నయ సూరి సమాస విభక్తికి లోపం చెప్తూ 'లట్టునకు గాదు' అని చెప్పాడు.

మందుల గట్టు (యుద్ధ. 272)

ఈ షష్ఠీ తత్పురుష సమాసంలో షష్ఠీ ప్రత్యయం యొక్క లోపించింది. బహువచన సూచకమైన లకారం లోపించలేదు. చెయువుల సాకిరి, వేయి చేతుల సామి, వెన్నుని బొడ్డు బిడ్డడు, కడవ చెవుల పోటరి, మంటంగల వజ, నుడువుల వడతుక, పాముల వేటకాడు, వేల్పుతేని మనుమడు మొదలైన వన్నీ ఇటువంటివే.

తత్పురుషాధులకు లక్షణం సంస్కృత వ్యాకరణాలలో చెప్పినట్లే గ్రహించాలన్న చిన్నయసూరి సూచన ననుసరించి అచ్చ తెలుగు రామాయణంలోని సమాస నిర్మాణ ప్రక్రియను పరిశీలించవచ్చు.

తత్పురుష ఉత్తరపదార్థ ప్రధానం. ఇది వ్యధికరణం అనీ, సమానాధికరణం అనీ రెండు రకాలు విగ్రహ వాక్యంలో సమాసంలోని రెండు పదాలకూ భిన్న విభక్తులుంటే వ్యధికరణ సమాసం పూర్వపదం ఏ విభక్తిలో ఉన్నా ఉత్తరపదం ప్రథమా విభక్తిలోనే ఉంటుంది. తెలుగులో ప్రథమా తత్పురుష సమాసం అరుదు.

ద్వితీయా తత్పురుష
లేనెలతాల్పు - లేత నెలను తాల్చువాడు
జింక తొల్పరి - జింకను తాల్చువాడు
అలరువిల్దాల్పు - అలరువిల్లును తాల్చువాడు

తృతీయా చతుర్థీ పంచమీ తత్పురుషలకు అచ్చతెలుగు రామాయణంలో ప్రయోగాలు లేవు.

షష్ఠీ తత్పురుష
జక్కులదొర - జక్కులయొక్క దొర
సంకుజిగి - సంకుయొక్క జిగి
ఆటగీములు - ఆటయొక్క గీములు
తెలుగులో విస్తృత ప్రయోగం ఉన్న తత్పురుష షష్ఠీ తత్పురుష.
సప్తమీ తత్పురుష
తలమానికము - తలయందలి మానికము
మిన్నేరు - మింటియందలి ఏరు

అచ్చతెలుగు రామాయణంలో నఞ్ తత్పురుష సమాసానికి అవకాశం లేదు. పూర్వపదంగా నఞ్ చేరి ఏర్పడ్డ సాంస్కృతిక సమాసానికి ఇందులో అవకాశం లేదు. లేదు, కాదు, వద్దు వంటి వ్యతిరేకార్థక పదాలే వ్యతిరేక, నిషేధాద్యర్థాలను బోధిస్తాయి. అచ్చ తెలుగులో తత్పురుష సమాసం సంస్కృతంలో లాగాకాక ద్వితీయా, షష్ఠీ, సప్తమీ విభక్తులకే పరిమితమయింది.

తత్పురుషలో సమానాధికరణమే కర్మధారయం సమాసంలోని రెండు పదాలూ ఒకే విభక్తిలో ఉండడంవల్ల ఇది సమానాధికరణ సమాసం.

బలుకబ్బము - బలువగు కబ్బము
కదయేనుగులు - కదలకుండునవగు ఏనుగులు

ఇవి విశేషణ పూర్వపద కర్మధారయ సమాసాలు. తెలుగులో సమాసంలో పూర్వపదం ఎప్పుడూ విశేషణమే. ఉత్తర పదం విశేష్యం. అందువల్ల విశేషణ పూర్వపద సమాసాలే తప్ప విశేషణోత్తర పద సమాసాలుండవు.

ఉపమాన పూర్వపద కర్మధారయం
చిగురుకేలు - చిగురువంటి కేలు
ఉపమానోత్తర పద కర్మధారయం
ఉల్లపుఁదామర - తామరవంటి ఉల్లము

తపసిపులి - పులివంటితపసి
సంభావనా పూర్వపదం
వెండికొండ - వెండిదగు కొండ
అవధారణా పూర్వపదం
రేయింతి - రేయియేయింతి

అవధారణా పూర్వపదాన్నే రూపక సమాసం అనికూడా అంటారు. ఉపమానోపమేయాల అభేదాన్ని తెలియజేస్తుందిది. విశేషణోభయ సమాసాలు కూడా అచ్చతెలుగు రామాయణంలో కనిపించవు

కర్మధారయం సంఖ్యాపూర్వమైతే ద్విగువు.
తిగప్రోళ్ళు - తిగయగుప్రోళ్ళు
ఇరునాల్గుకడలు - ఇరునాల్గగుకడలు
సతప్రోళ్ళు - సతయగు ప్రోళ్ళు
ఇరుసతజగములు - ఇరుసతములగు జగములు

అచ్చతెలుగు రామాయణంలో ఇటువంటి ద్విగు సమాసరూపాలు విస్తృతంగా ప్రయుక్తమయ్యాయి.

సంస్కృత సమాసానువాద రూపంలో బహువ్రీహి సమాస ప్రయోగం కూడా అచ్చతెలుగు రామాయణంలో విస్తారంగా కనిపిస్తుంది

నల్మొగముల ప్రోద - నలుమొగములు గల ప్రోద (చతుర్ముఖుడు)
పసిండి బొజ్జదొర పసిండి బొజ్జగల దొర (హిరణ్యగర్భుడు)
మనుబోతు కొమ్ము తపసి - మనుబోతు కొమ్ముగల తపసి (ఋష్యశృంగుడు)

ఉభయ పదార్థ ప్రధానం ద్వంద్వం
బత్తిముత్తులు - బత్తియు ముత్తియు
ఆలుమగలు - ఆలును మగడును
తలిదండ్రులు - తల్లియు తండ్రియు

సంస్కృతంలో ఈ సమాసం ద్వివచనాంతం, తెలుగులో బహువచన ప్రత్యయంతోనూ, బహువచన ప్రత్యయం లేకుండానూ కూడా ప్రయుక్తమవుతుంది.

పూర్వ పదార్థ ప్రధానం అవ్యయీభావం. ఈ సమాసంలో నామవాచకాలూ, అవ్యయాలూ ఉంటాయి. కేతన తెలుగులో పెడతల, క్రేగన్నులు ఈ సమాసానికి ఉదాహరణలుగా ఇచ్చాడు. వీధ్యాం వీధ్యాం ప్రతివీధి అనడానికి అచ్చ తెలుగు రామాయణంలో వీదీ వీదులను (సుందర. 164) అని తిమ్మకవి ప్రయోగించాడు.

సాంస్కృతిక, మిశ్ర సమాస ప్రయోగం నిషిద్ధం కాబట్టి సంస్కృతం లోని దీర్ఘ సమాసాలను అనువాదం చేసుకోవడంలో అచ్చ తెలుగు కవులు పడిన బాధ వ నాతీతం. కొన్ని సందర్భాలలో కృతకంగా నిర్మించిన ఈ సమాసాలను అ ం చేసుకోవడమే కష్టం. మూల సంస్కృత సమాసాన్ని గుర్తిస్తే తప్ప అర్థబో కలగదు.

సమాసాలను అనువదించినప్పుడు కొన్ని సందర్భాలలో పదానికి పదం అనువదించడమే తప్ప సంస్కృతంలోని వ్యుత్పత్తిని తెలుగులో కూర్చడం సాధ్యం కాలేదు. దశరథుడు లేక పంక్తిరథుడు అన్న సమాసానికి 'దశసుదిక్షు అప్రతిహతః రథః' అన్న వ్యుత్పత్తికి తెలుగు అనువాదంలో అవకాశం లేదు. చాల్పు తేర్లదొర (బాల. 20), జమిలిచౌవంచ తేర్లరా చలివెలుగు (బాల. 156), బంతి తేరుల రాచమేల్బంతి (బాల. 161) పది తేరుల దొర (బాల. 131) మొదలైన విధంగానే తిమ్మకవి అనువదించాడు. రామ శబ్ద వ్యుత్పత్తిని అనువదించలేదు. విశేషణాలతో వివరించాడు.

రాతికుసు ర్లొసంగిన దొర
చాలు పేరింటి ప్రోయాలి మగడు
పుడమి చెలి యల్లువాడు
రక్కసి మగువంబొరిగొన్నవాడి మగడు
పుడమి కాన్పు మగడు

రావణుడు

చాల్పుమోముల చెడుగుతొల్వేల్పుతేడు
వరుసమెడల నల్లద్రావుడు దొర
ఇరుచౌవంచ యౌదలల రక్కసి

పరశురాముడు

గండ్రగొడ్డలి తాల్పునేలవేల్పు

సుగ్రీవుడు

సతవారువములతోదు కొడుకు

హిరణ్యాక్షుడు

తాళువాకంటి తొలివేల్పు

హిరణ్యకశిపుడు

మిడిమేలపు నంజాడుదిండి రాచబల్మన్నియ

హనుమంతుడు

మబ్బుత్రోవరికూన

పాములమేత బుడుత

గాలిబుడుత

గాడుపుచూల్వేడు

బలరాముడు

కొనరిక్క పేరి పొలతుక పెనిమిటి

నందిగ్రామం

మిత్తి వేటకాని తత్తడి యూర

సీత

ప్రొద్దు కొలుపు సామిముద్దియ

వేదాలు

తొలిపలుకులు

ప్రాత మినుకు నుడువులు

ఇవి ఉదాహరణ మాత్రాలు మాత్రమే. శివుడు, పార్వతి, భూమి లక్ష్మి, సరస్వతి మొదలైన వాటికెన్నో పదబంధాలను కూర్చాడు తిమ్మకవి. శ్రేష్ఠ వాచకమైన సింహం అనేక మారురూపాలు పొందింది.

తోగి బొబ్బమెకము (బాల 153)

తోగి తెలివాయి మెకము (అరణ్య. 7)

గుబ్బలిదిమ్మరిసింగము (సుందర. 87)

తెలుగులో తత్పురుష కర్మధారయ సమాసాలను గుర్తించడం విగ్రహ వాక్యం ద్వారానే. శ్రేష్ఠతా వాచకం పోలిక చెపితే కర్మధారయమూ, నిర్ధారణ చెపితే తత్పురుషా కావచ్చు. సమాసం అర్ధ ప్రధానం కాబట్టి మనం చెప్పే అర్థాన్ని బట్టే సమాస విభాగం ఉంటుంది. అందువల్ల కేతన చెప్పిన అర్థ ప్రధాన విభాగమే సముచితంగా ఉంటుంది.

## వాక్యం :

తెలుగు వాక్యంలో కర్త కర్మ క్రియ క్రమం. సామాన్య తెలుగు వాక్యం చిన్నది. అసమాపక క్రియలతో సుదీర్ఘ వాక్యనిర్మాణం తెలుగులో సాధ్యమయినా రచనలో ఈ సంప్రదాయం అంతగా లేదు. కావ్యాలలో అలంకారిక వచన రచనా సందర్భంలో ఇటువంటి వాక్యాల రచన ఎక్కువగా ఉంటుంది సాధారణంగా తెలుగుకావ్యాలలో వచనాలు ఒకటి రెండు పదాలతో సంధానకాలుగా ప్రవర్తిస్తాయి. కథనంలోనూ, వర్ణనలలోనూ కొన్ని సందర్భాలలో మాత్రమే దీర్ఘ వచనం ఉంటుంది. వాక్య నిర్మాణం వచన భాగంలోనూ, పద్యభాగంలోనూ కొంత భిన్నంగా ఉంటుంది. వచన భాగంలో సామాన్య పదక్రమాదులు నియతంగా ఉంటాయి. పద్యంలో ఛందో నియమాల కారణంగా వీటి వ్యతిక్రమం కూడా ఉంటుంది.

స్థూలంగా వాక్యనిర్మాణ సూత్రాలలో పరిణామం చాలా తక్కువగా ఉంటుంది. భాషలోని పదాలు, ఉచ్చారణాదుల్లో కలిగినంత వేగమైన మార్పు వాక్యనిర్మాణ సూత్రాలలో కలగదు. కాబట్టి కావ్య భాష ఆరంభంనుండి నేటివరకు వాక్యనిర్మాణ విధానంలో వచ్చిన మార్పులు తక్కువే ముఖ్యంగా తిమ్మకవి నాటి కావ్య భాషలో చెప్పుకోదగిన పరిణామాలు లేవు.

### కర్మణి వాక్యాలు :

కర్మణి వాక్యాలు రెండు విధాలు : 1. సంస్కృత క్రియాపదం కర్మణిగా ఉన్నది (**Lexical passive**) 2. తెలుగులో 'బడు' అను బంధం చేరడం ద్వారా వాక్యం కర్మణిగా మారినది. మొదటి పద్ధతికి అచ్చ తెనుగు రామాయణంలో అవకాశం లేదు. ఆశ్వాసాంత గద్యలలో మాత్రం ఇది కనిపిస్తుంది. ఉదా: "తిమ్మయ నామధేయ ప్రణీతంబైన యచ్చ తెలుఁగు రామాయణమను మహాకావ్యమందు బాలకాండము."

కూచిమంచి తిమ్మకవి 'బడు' ప్రయోగం కూడా అరుదుగా చేశాడు.

ఓ లక్ష్మణుఁడా యను రొద
యాలింపంబడియె నిప్పుడడవిం జనుచో
నేలాటి చేటు వొందెనొ
వైళమ మీయన్న నరయ వెడలుమటన్నన్ (అరణ్య. 46)

**యత్తదర్థక వాక్యాలు :**

యత్-తత్, ఏది-అది అనే నిర్మాణం ఉన్న వాక్యాలు. వీటినే సంబంధ బోధక వాక్యాలంటారు. తిమ్మకవి అచ్చతెలుగు రామాయణంలో యత్తదర్థక వాక్యాల ప్రయోగం కూడా చాలా తక్కువే.

ఏ మేటి యడుగుఁగెందామర బల్గావు
రపుటేల్లుఁజేని కబ్బంపుఁదెప్ప
యేబల్లిదుఁడు చెపనిడు నక్కరములు చె
ల్వపు ముత్తిమేడకు వరుసమెట్లు
లేపున్నెములగని యెఱిఁగించు మేత్రెల్వి
కల్లజగంబు చీఁకటికి దివ్వె
యేదంట యొసఁగునున్నూది దోసపుఁదుల్వ
గాడ్పుదిండులకు వాకట్టు మందు

తనరనే పెద్ద పుట్టువులను కడింది
తెవులునకు వెజ్జు తేఁదట్టి దెందులూరి
కొలఁపుపాలేటి నిండు జాబిలి యనంగఁ
దనరు లింగన గురుని డెందమునఁదలతు. (పీ. 11)

జడదారి రాయ యిజ్జగమున నాడెంపు
గొనమున వాఁడియుఁ గనికరమును
నిక్కవపుంబల్కుఁజక్కఁదనంబును
దెలివియు జాగంబు తేజు పెంపు

కలిమియు బలిమియుఁగడిఁది నిచ్చలమును
గొలమును దిటమును వలఁతితనము
మేలిమియును నెల్ల మెయిదాల్పు పిండుల
యెడ నెయ్యమును జాలనే డైఱయును
గలుగు మానిసి యెవ్వఁడు గలఁడు వాని
కత.... (బాల. 2)
కావున మా యెడ మీకుం
గావలసిన కర్జమెద్ది గలదది మాతో
వేవేగఁదెల్పు డిమ్మగ.... (బాల. 67)

కర్మణి వాక్యాలూ, యత్తదర్థక వాక్యాలూ తెలుగుకు సహజం కావు. సంస్కృత భాషా ప్రభావం వల్ల తెలుగులో నేర్పడ్డవి. అచ్చతెలుగు కావ్యంలో ఈ విధమైన వాక్య నిర్మాణం సహజంగానే క్వాచిత్కం. అందుకే తిమ్మకవి రచనలో ఇవి అంతంతమాత్రమే. యత్తదర్థక వాక్యాల స్థానంలో తెలుగు వాక్య నిర్మాణ పద్ధతిలో క్రియాజన్యవిశేషణాలు నిలుస్తాయి.

**క్రియారహిత వాక్యాలు :**

రెండు నామ బంధాలతోడి వాక్యాలు క్రియారహిత వాక్యాలు. క్రియ స్థానాన్ని మరోనామబంధం ఆక్రమిస్తుంది. ఈ వాక్యాలనే నామాఖ్యాన వాక్యాలని కూడా అంటారు.

మొలక నవ్వులవాఁడు తలుకారుతొలుకారు
బలు కార్మొగులఁగేరు పొలుఁపువాఁడు
నిడుదచేతులవాఁడు నిద్దంపు టద్దంపు
సుద్దంపు నెఱి చెక్కు జోటివాఁడు
వెడఁద కన్నులవాఁడు విప్పారి యొప్పారు
గొప్ప నెన్నుదురుచే నొప్పువాఁడు
వఱపు పేరెదవాఁడు పరువంపు గరువంపు
నెలవోని నెమ్మొము గలుగువాఁడు

కేలసింగాణి విల్లొగిఁ గ్రాలువాఁడు
కుఱుచ మెడవాఁడు సోగ పెన్నెఱుల వాఁడు
వలఁతియగువాఁడు ముజ్జగంబులును వలచు
సోయగమువాఁడు సువ్వెనీ రాయఁడింతి. (సుందర. 83)
అరయనిన్ని తెఱంగుల నలరువాఁడుసూవె నీ ముద్దుల మఱంది
తీవఁబోడి (సుందర. 84)

పువ్వారుబోడి నీ పేరెవ్వరు? నీ తల్లిదండ్రులెవ్వారు (అరణ్య. 55) వంటి ప్రశ్నార్థక పదాలతోడి వాక్యాలు కూడా క్రియారహితాలే.

**సంశ్లిష్ట వాక్యాలు :**

క్త్వార్థక శత్రర్థక క్రియా పదాలతో సుదీర్ఘ సంశ్లిష్ట వాక్య రచన అక్కడక్కడా కనబడుతుంది యుద్ధకాండలో ఇటువంటి వాక్యాలు ఎక్కువగా ఉన్నాయి. యాభై రెండు పాదాల రగడ (యుద్ధ. 64)లో క్త్వార్థక, శత్రర్థక అసమాపక క్రియలతోడి సుదీర్ఘ వాక్యం కనిపిస్తుంది.

విడుచుచుం చుట్టుచుం బొడుచుచు నడుచుచుఁ
దన్నుచు గ్రుద్దుచు దాఁటు కొనుచు
నెగయఁచు మొగియుచు నేలఁ దెళ్ళుచుఁ గ్రిందు
మీదై పెనంగుచుఁ బాదుకొనుచు.... (యుద్ధ. 195)

శత్రర్థక అసమాపక క్రియలతోడి వాక్యం ఇది. నారదుడు చేసిన రామ స్తవం (యుద్ధ. 161) దండక రూపంలో ఉంది. ఈ దండకం కూడా సుదీర్ఘ సంశ్లిష్ట వాక్యమే. యుద్ధ వర్ణనాత్మకమైన వచనం (యుద్ధ. 364)లో నలభై అసమాపక క్రియలతో మహావాక్యాన్ని కూర్చాడు.

**కిలార్థకాదులు :**

'అట' కిలార్థకంలో తెలుగులో వాడుకలో ఉంది. కూచిమంచి తిమ్మ కవి అచ్చతెలుగు రామాయణంలో 'అట'ను కిలార్థకంగా ప్రయోగించాడు

ఒనరఁ దలిదండ్రుడు లెలమితోఁ బనుపుదురఁట
తోడఁబుట్టువు పుడమికి దొరయగునఁట
పున్నియపు నేలలొగిఁ గాంచఁ బోవుటయఁట
మెలఁత మఱియింత కంటెను మేలు గలదె (అయోధ్య 61)

కద, కదా లు కూడా కిలార్థకాలే.

చానలతలమిన్నఁ గానరు గద....
సోయగంబుల ప్రోకఁ జూడరు గద....
రతనంపుగని యిందు రాదుగదా.... (అరణ్య. 86)

'ఓ' సందేహార్థకం

కటకట సైదోడ క్రాల్గంటి కార్మెకంబుల చేతఁ బొంసెనో, యలుక
జేసి కానల డాఁగెనో కఱకు రక్కసుల చేజిక్కెనో.... (అరణ్య. 85)

'ఓ' ప్రశ్నార్థకం కూడా.

సంద్రము లుమ్మడి నింకఁ జేతునో (సుందర. 22)

'ఏ' ప్రశ్నార్థకం

మీరిపుడు మా నవలా రతనంబుఁ జూచినారే చెపుఁడా (అరణ్య. 87)

'ఆ' కూడా ప్రశ్నార్థకం.

ఇంక నోర్వఁదరమా.... (అరణ్య. 96)

'ఏ' నిశ్చయార్థకం కూడా.

చిలువరాయడు ప్రొద్దు చూలియు జింకతాల్పును వేల్పుఁబెద్దయు
వెలి హుమాయి వజీరుడుం గరివేల్పు నీవె.... (యుద్ధ. 64)

'ఏ' ప్రార్థనార్థకం కూడా.

వేలువుల వేల్ప మా మొఱ యాలకించి కనికరపు జూడ్కి
గనుగొని గాటమగుచు నెదల బొదలెడు నఘకెల్ల బ్రిదిల
పఱిచి సాకవే (బాల. 43)

తెలుగు భాషకు సహజమైన అన్ని వాక్యనిర్మాణ రీతులు సహజంగానే అచ్చతెలుగు రామాయణంలో కనిపిస్తాయి.

**జాతీయాలు :**

ప్రతి భాషలోనూ జాతీయాలు ఆ భాషకు వన్నె తెస్తాయి. వీటిని ఇతర భాషలలోకి అనువదించడానికి వీలుకాదు. అనువదించినా మూలభాషలో ఉన్న సొగసు రాదు. మూల భాషలోని జాతీయానికి సమానమైన జాతీయం మరొక భాషలో ఉండవచ్చు, ఉండకపోవచ్చు. ఒక జాతీయాన్ని అనువాదం చేసుకోవడానికి ఒక్కొక్కసారి ఒక వాక్యాన్నే కూర్చవలసి వస్తుంది.

కూచిమంచి తిమ్మకవి తన అచ్చ తెలుగు రామాయణంలో చక్కని జాతీయాలను వాడి తన రచనా సౌందర్యాన్ని ఇనుమడింప చేసుకున్నాడు. అచ్చ తెలుగు కావ్యం కావడంవల్ల ఈ గ్రంథంలో తెలుగు జాతీయాలు లెక్కకు మిక్కిలిగా చోటు చేసుకొని పాఠక హృదయాలను అలరిస్తున్నాయి.

పూరి దినుకొంచు (బాల. 11)
వంకయును మచ్చయును (బాల. 17)
కొఱకొఱయును (బాల. 19)
నీరాలుకుట (బాల. 20)
కట కటపడి విడిముడి (బాల. 23)
మిడిమేలపు (బాల. 128)
పేరుగల యింటి (అయోధ్య. 24)
అరడి బెట్టు (అయోధ్య. 25)
ముప్పొద్దు ముప్వేసములు (అయోధ్య. 42)
ఉప్పిదులు (అయోధ్య. 54)
తలకు బాసిన వెంట్రుక (అయోధ్య. 72)
వదరాని పాట్లు (అయోధ్య. 84)
తప్పు టడుగులిడుచు (సుందర. 26)
పొట్ట క్రొవ్వున (సుందర. 51)
దొడ్డు కొంటెంబులు (సుందర. 157)
తెలిసీప్పు (కిష్కింధ. 89)
వెట్టిసీక్కు (యుద్ధ. 131)

మొదలైనవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఈ జాతీయాలన్నీ ప్రాంత భేదాలు లేకుండా ఆంధ్రదేశ మంతటా వాడుకలో ఉన్నవే. తెలుగు నుడికారాన్ని, పలుకుబడిని పరిచయం చేసేవే.

## సామెతలు :

జాతీయాల లాగానే సామెతలుకూడా చక్కని భావాలను వ్యక్తం చేస్తాయి. భాషా సౌందర్యాన్ని నుమడింప జేయడంలో సామెతలుకూడా జాతీయాల ప్రక్కన నిలుస్తాయి. సామాన్య ప్రజానీకం జీవితానుభవాల నుండి ఏర్పడ్డ సామెతలు ఒక్కొక్కటి ఒక సత్యాన్ని వెలువరిస్తుంది. ఒక ప్రకరణం చెప్పే విస్తృతార్థాన్ని ఒక చిన్న సామెత స్పష్టంగా, సూటిగా వ్యక్తం చేయగలుగుతుంది. సందర్భోచితంగా సామెతలను ప్రజలు తరతరాలుగా వాడుతున్నారు.

కూచిమంచి తిమ్మకవి కూడా అచ్చతెలుగు రామాయణంలో ఎన్నో సామెతలను అర్థవంతంగా ప్రయోగించాడు.

'కానంగాచిన వెన్నెలగా చేయదగునె' (సుందర. 38) సీతపై మరులు గొని అర్ధరాత్రి అలంకరించుకొని రావణుడు సీత దగ్గరకు వస్తాడు తన ప్రేమను వ్యక్తం చేస్తాడు. సీత తిరస్కరిస్తుంది. ఆమెకు హితం చెప్పడానికి ప్రయత్నిస్తాడు అడవిలో కాచిన వెన్నెల లాగా నీ యవ్వనాన్ని ఎందుకు వృథా చేసుకుంటా వంటాడు. వెన్నెల సర్వప్రాణులకూ ఆహ్లాదజనకం. అది శుక్లపక్షంలో మాత్రమే ఉండేది. అట్లాగే మానవ జీవితంలో యవ్వనం కొంత కాలం మాత్రమే ఉండేది. ఉన్నప్పుడే ఆనందించాలితప్ప వృథా చేసుకోకూడదని బోధ. మానవుని స్వార్థం అట్లా అనిపిస్తోంది. అడవిలో కాచిన వెన్నెల వృథాయేనా? తనకు పనికిరాకపోతే ఏదైనా, ఎక్కడైనా వృథాయే. ఇది మానవ స్వభావం. వెన్నెలకున్న తక్కిన ప్రయోజనాలు లెక్కలోకి రావు.

'కొరవిం దల గోకుకొనగ గోరెడి కరణిన్' (సుందర. 50)

సీత తనను కోరిన రావణుని భయపెడుతోంది. పొయ్యిదగ్గర ఉన్న వ్యక్తి అందుబాటులో ఉన్న కొరవితో తల గోకికొంటే హాయి చేకూరదు సరిగదా తల కాలి పరలోకానికి వెళ్ళవలసి వస్తుంది తన్ను తానెరిగి ఆపద లేని పని చేయాలని ఉపదేశం రాముడు శాంతమూర్తి, కాని కోపిస్తే కొరవి లాగా సర్వనాశనం చేసేవరకు చల్లారనివాడు. అందుకే అతనితో వైరానికి కారణమైన తన చెర రావణ వంశనాశనానికే అని సీత ఉపదేశించింది.

'నెయ్యి సోకిన యగ్గివోలె' (సుందర. 112) అశోకవనంలో కావలి వారందర్నీ హనుమంతుడు పిడికిటి పోట్లతో చావగొట్టగా రాక్షసులు రావణునికి తెలియజేశారు. ఆ మాట విన్న రావణుడు నేయి పడదంతోటే మండే అగ్ని లాగా కోపించాడు. తాను విలాసం కోసం ఏర్పరచుకొన్న తోట భగ్నమైంది. ఆ తోటను రక్షించే రక్షకులు నేలకూలారు. సీతను ఆ వనంలో ఉంచడం ఆమెతో ఆ వనంలో విహరించడం కోసమే. వనరక్షకుల నాశనంతో సీతను ఆ వనంలో ఉంచిన ప్రయోజనం కూడా భగ్నమైనట్లే. అందుకే అగ్ని మండినట్లు మండిపోయాడు. నెయ్యిసోకగానే అగ్ని ఏవిధంగా ఒక్క ఉదటున మంటలు రేగుతుందో ఆ విధంగా రావణుడు క్రోధోద్విగ్నుడయ్యాడు.

'గుడి మ్రింగెడు వానికి లోనదరెడు వేల్పుట్రవడియము' (సుందర. 155) ఆలిని కోల్పోయి ఆకు అలములు తింటూ కాసుపిసంలేని రాముణ్ణి కొలిచే మీరు తెలివితక్కువవాళ్ళు. దిక్పాలకులనే తరిమిన రాక్షసులకు రాము దొక లెక్కా? గుడినే మింగేవాళ్ళకు గుళ్ళోని దేవుడొక లెక్కా? అందువల్ల రాముని విడిచి బతికి బయటపడండి అని రావణుడు హనుమంతునికి హితం చెప్తున్నాడు. తాము సమర్థులు, రాము డసమర్థుడు అని చెప్పడంతోపాటు ఎవరినైనా ఓడించ గల రాక్షసులకు రాముని ఓడించడం చాలా సులభమని చెప్తున్నాడు. గుడి మింగేవాడికి గుళ్ళో లింగమెంత? అనీ, గుడి మింగేవాడికి గుడి తలుపులు అప్పడాలనీ కూడా వ్యవహారంలో ఉంది.

'చెడు గోరుకొనువాని కరయ నాపలపలుకు సెవులకు గొరవియై పరగకున్నె' (సుందర. 156) తన గొప్పతనాన్ని చెప్పుకున్న రావణునికి సమాధానం చెప్తూ హనుమంతుడు చెడునే కోరుకునే నీకు నా మాటలు కొరవిపలె

బాధనే కలిగిస్తాయంటాడు. నీకు రాముని పరాక్రమం తెలియదు. స్వాభిమానివైన నీకు మంచీ చెడూ గుర్తించే ఓపిక శూన్యం అందుకే నా హిత వచనాలుకూడా నీకు కొరవి లాగానే అనిపిస్తాయి, అహితంగానే కనిపిస్తాయి అంటాడు.

'దొంగ చేతికి ద్రాళ్ళొసంగి నెట్టుకొని యింటివారల మేల్కొలుపు వడువున' (యుద్ధ. 36) రాముడు లంకను ముట్టడించాడు. సీతనప్పగించి రాక్షస కులాన్ని రక్షించమని విభీషణుడు రావణునికి హితవుచెప్పాడు. దానికి కోపించి రావణుడన్న మాటలు. శత్రుపక్షంతో కలిసిపోయి తనపక్షం వారిని మేల్కొల్పుతున్నట్లుగా ఉన్నాయి నీ మాటలు. విభీషణునిది బూటకమని రావణుని అభియోగం.

'పని చేతికి వచ్చినపుడె పని సవరింపజెల్లు' (యుద్ధ. 56) రావణుడు వెళ్ళగొట్టగా విభీషణుడు మరికొందరితో రాముని శరణు వేడడానికి వస్తాడు. పగవాడు చేతికి చిక్కాడు, వాని నిప్పుడే చంపడం మంచిదని వానరవీరులన్నారు. అవకాశం దొరికినప్పుడే పని పూర్తిచేసుకోవాలని భావం. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్న సామెతకు ఇది సమానం.

'రాచవాని నమ్మరాదనుమాట' (యుద్ధ. 287) యుద్ధంలో రావణుని సోదరుడు కుంభకర్ణుని కుమారులు కుంభ, నికుంభులు వానరులతో పలికిన పలుకులు. రాముడు రాచవాడు. రాచవారు స్వార్థపరులు. తమలాభంకోసం స్వపరభేదం చూడకుండా దేనికైనా సిద్ధపడతారు. రాముడు తన భార్యను ఎట్లాగూ అప్పగించి వేశాడు, ఇక మిమ్మల్ని కూడా అప్పగిస్తాడు. మీరు ఇది కూడా అర్థంచేసుకోలేక పోతున్నారు. రాచవారు ఏరుదాటి తెప్ప తగలేసేవారని భావం. తమ నాశనంతోపాటు తమకు సహాయంచేసేవారి నాశనానికి కూడా కారణమవుతారని అర్థం.

'కోతులెచ్చట జగడంపుఁజేతలెచ్చట?' (యుద్ధ. 288) పై సందర్భంలోనే ఇదికూడా. కోతులకు యుద్ధ కృత్యాలకూ సంబంధమెక్కడ? కోతులు యుద్ధం చేయగలవా? నక్క ఎక్కడ? నాగలోక మెక్కడ? అన్న విధంగా యుద్ధం వంటి ఘన కార్యాలు కోతుల వంటి అల్ప జంతువుల సామర్థ్యానికి మించినవని చెప్పి భయపెట్టే ప్రయత్నం.

'తానొకటి తలచిన దయ్యం బొక్కటి దలచునన్నమాట' (అయోధ్య. 64) అయోధ్యాకాండలో శ్రీరాముడు అడవులకు పోతూ తల్లికి నమస్కరించాడు. ఆమె రాముని మీద ఎన్నో ఆశలు పెంచుకుంది. ఆ ఆశలన్నీ అడియాశలై ఇప్పుడు అడవికి పోవలసినవాడయ్యాడు. ఇది ఆమె ఊహించినది కాదు ఆశాభంగం అయింది. తాను తలచిందొకటి, దైవం తలచిందొకటి. మానవులు అనుకున్నది అనుకున్నట్లు జరగదనీ, దైవ విధిని గడవడం ఎవరి తరమూ కాదనీ భావం.

'పెను రొక్కపుఁ గుప్పఁగన్న పేదం పగిదిన్' (బాల. 39) దేవతలు శ్రీ మహావిష్ణువును దర్శించిన సందర్భంలోనిది. ఎవరికీ చూడవీలులేని నిన్ను చూడగలగడమే భాగ్యం. నీ దర్శనమిప్పుడు మాకు పెన్నిధిగన్న పేదలవలె అయిందని దేవతలు విష్ణువుతో విన్నవించుకొన్నారు.

'నేతికొఱకు వెన్నపై నగ్గి సందెడు వ్రేయఁ జనునె (అయోధ్య. 26)
'బెబ్బులిగన్న లేడిజోటియుంబోలె (అరణ్య. 62)
'మగడే కదతొడవులెల్ల మగువల కెందున్' (అయోధ్య. 53)
'పెనిమిటి కన్నం దెఱవలకు వేఱెకలరే వేల్పుల్' (అయోధ్య 52)

కూచిమంచి తిమ్మకవి సందర్భోచితంగా అనేక సామెతలను ప్రయోగించాడు.

## రేఫ ఱకారాలు :

కూచిమంచి తిమ్మకవి తన 'లక్షణసార సంగ్రహము'లో రేఫ ఱకార నిర్ణయానికి ఒక ఆశ్వాసం పూర్తిగా వినియోగించాడు.[18] తిమ్మకవికి చాల పూర్వమే రేఫ ఱకారాలకు ఉచ్చారణ భేదం నశించింది. అందువల్ల ఏ పదంలో లఘు రేఫం ఉందో, ఏ పదంలో అలఘు రేఫం ఉందో గుర్తించడం కష్టం. తిమ్మకవి లక్షణ సారసంగ్రహం తృతీయాశ్వాసంలో రేఫ ఱకార నిర్ణయం చేశాడు. ప్రామాణికుడైన కవి తన కావ్యంలో రేఫ ఱకారాలను తెలుసుకొని ప్రయోగించాలన్న ఉద్దేశమే ఈ ప్రత్యేక ప్రకరణ రచనకు కారణం. పూర్వ కవుల ప్రామాణికత, అప్రామాణికతలకు ఈ రేఫ ఱకారజ్ఞానం ఒక నిదర్శన

మయింది. పోతన భాగవతంలో రేఫ ఱకార సాంకర్యం చేసినందువల్లనే ఆది లాక్షణికులుదహరింపలేదని అప్పకవి చెప్పాడు.[19] తిమ్మన ఈ విషయంలో భిన్నాభిప్రాయం వ్యక్తం చేశాడు.[20] రేఫ ఱకారాల తెరగు తెలుసుకొని సుకవులు తమ కావ్యాలలో ప్రయోగించాలని చెప్పాడు.

వలనుగ రేఫ ఱకారం
బుల తెఱఁగంతయును సుకవిపుంగవులిందున్
దెలిసికొని కబ్బములలో
నిలువందగు దేవ దేవ నీలగ్రీవా![21]

లాక్షణికుడూ, ప్రామాణికుడూ అయిన కూచిమంచి తిమ్మకవి తన అచ్చ తెలుగు రామాయణంలో తన మతానుసారంగా రేఫ ఱకారాలను ప్రయోగించాడు.

## ఆలంకారిక శైలి :

అచ్చతెలుగు రామాయణం ప్రబంధం ప్రబంధం వర్ణనాత్మకమూ, ఆలంకారిక శైలీ సమన్వితమూ ప్రబంధంలో ప్రధానమైన వర్ణనలన్నీ తిమ్మకవి తన అచ్చ తెలుగు రామాయణంలో చేశాడు అర్థాలంకార ప్రయోగం ఏ భాషలో నయినా సహజమే. శబ్దాలంకార ప్రయోగం సంస్కృత భాషలో ఒదిగినట్లు తెలుగులో ఒదగడం కష్టం. అయినా యమకానుప్రాసాద్యలంకారాలను కూచిమంచి తిమ్మకవి అచ్చతెలుగు రామాయణంలో అత్యంత సహజంగా ప్రయోగించాడు. అవలీలగా సాధించాడు.

గ్రుడ్డు కానుపు తేఁడు గ్రుడ్డు కానుపు తేఁడు
గుబ్బంబు పొన్పునై కొమరు మిగుల
జింకతాలుపరియు జింకతాలుపరియు
మఱఁదియు ననుఁగునై మెఱపుఁజూప .... (పీ. 3)

అని నాలుగు పాదాలలోనూ యమకంతో అలంకరించాడు.

పెనురాచ ముంగిళ్ళఁ బెంపుడు తోఁటల
మావులు మావులు ప్రోవు మీఱ
నాడెంపుఁ గోడల నాగవాసమ్ములఁ
గొమ్మలుఁ గొమ్మలు గొనబుఁజూప.... (బాల. 7)

ఈ పద్యంలోనూ నాలుగు పాదాల్లో యమకం హృదయంగమం.

మేడలా రతనంపు గోడలా యవరంజి
బేడలా, యేవాడఁ బెంపెసంగు
మావులా బలితంపు టావులా చెంగల్వ
బావులా.... (బాల. 9)

ఇందులోని అనుప్రాస సంగీత ప్రధానంగా సాగింది. విరహంలో తలచుకొని తలచుకొని దుఃఖించే సందర్భాలలో తిక్కన నాటినుండి నేటివరకు ఒక విధమైన పద్యరచన ప్రచురంగా ఉంది. ముఖ్యంగా రాముడు అడవికి పోయిన సందర్భంలో, రాముడు సీత నెడబాసిన సందర్భంలో తెలుగు రామాయణాలన్నిటిలోనూ ఇటువంటి రచన కనిపిస్తుంది. తిమ్మకవి అచ్చ తెలుగులో కూడా దీనిని సాధించాడు.

రాముడడవికి పోగా దశరథుని మొర—

రాయనుఁగా యనుం దొగలరాయనిఁగేరు నిగారపుం గుడా
రాయను మేటి నాడెపు దొరాయను.... (అయోధ్య. 89)

కాయను మేటి తప్పు కొడుకాయను నిద్దపుఁ బూఁతమావిమో
కాయనుఁ బంజరంపుఁ జిలుకాయను.... (అయోధ్య. 90)

సీతను బాసిన రాముని మొర—

మాయనుగుంజెలిన్ వెతకుమాయను వొప్పఁదుటారి చిల్కలే
మాయను గండుఁదేటి కొదమాయను.... (అరణ్య. 96)

పాయను నేరమేమి బలుపాయపు నాడెపు ప్రోదరాచపా
పాయనుఁ గుందనపు మెఱుపాయను.... (అరణ్య. 97)

లక్ష్మణుడు మూర్ఛిల్లినపుడు రాముని మొర—

దాయను గెల్చుటింక గలదాయను రాచకొలంపు కల్వవిం
దాయను నాడెమైన బిరుదాయను.... (యుద్ధ. 399)

డాయనదేలరావు బెగడాయను నెక్కటి చిల్వగెల్పుకాఁ
డాయను ముద్దురా కొమరుఁడాయను (యుద్ధ. 400)

అచ్చ తెలుగులో ఇటువంటి శబ్దాలంకార ప్రయోగం తిమ్మకవి విశిష్టత. ఒక సర్వలఘు సీసాన్ని కూడా రచించాడు.

తొలి పలుకుఁ గొనలుఁ దెలియు తవసిచలి
వెలుఁగులకు దొరకు చెలువులగని
తెలి కదలిని గరువలి కుడు పటదొర
పఱపు పయి నిదురఁ గొఱలును డియు.... (అరణ్య. 114)

కూచిమంచి తిమ్మకవి సార్వభౌముడు అచ్చ తెలుగు రామాయణాన్ని రచించి సహృదయ సామాజిక హృదయ సింహాసనాల నధిష్ఠించాడు.

# సూచికలు

ప్రకరణం - 1 :

| | | |
|---|---|---|
| 1. | "కౌండిన్యగోత్ర విఖ్యాతుండ" లక్షణ సార సంగ్రహము, | ప్ర. 7 |
| 2. | రుక్మిణీ పరిణయము, | ప్ర. 12 |
| 3. | అచ్చ తెలుగు రామాయణము | పీ. 15 |
| 4. | పై | పీ. 15 |
| 5. | రసికజన మనోభిరామము | ప్ర. 24 |
| 6. | పై | ప్ర. 24 |
| 7. | నీలా సుందరీ పరిణయము | ప్ర. 10 |
| 8. | లక్షణ సార సంగ్రహము | ప్ర. 4 |
| 9. | అచ్చ తెలుగు రామాయణము | పీ. 11 |
| 10. | రుక్మిణీ పరిణయము | పం. 128 |
| 11. | లక్షణ సార సంగ్రహము | తృ. 36ర |
| 12. | రసికజన మనోభిరామము | పీఠిక |
| 13. | శివలీలా విలాసము | పీఠిక |
| 14. | రుక్మిణీ పరిణయము | ప్ర. 23.24 |
| 15. | సింహాచల మాహాత్మ్యము | పీఠిక |
| 16. | రసికజన మనోభిరామము | ప్ర. 22 |
| 17. | సమగ్రాంధ్ర సాహిత్యం, సం. 12, | పు. 225.26 |

ప్రకరణం - 2 :

1. సమగ్రాంధ్ర సాహిత్యం-12, ఎమెస్కో, మద్రాసు, 1968. పు 216
2. పై పు. 1
3. ,, పు 1
4. ,, పు 2
5. ,, పు. 1-2
6. ,, పు. 1-3
7. ,, పు. 4-6
8. ,, పు. 214
9. ,, పు. 6
10 కుక్కుటేశ్వర శతకము 59
11. పై 58-61
12. ,, 24-32
13. ,, 22
14. ,, 21

ప్రకరణం - 3 :

1. ఆంధ్ర భాషాభూషణము 18-27
2. కావ్యాలంకార చూడామణి 9-11, 14, 18
3. అప్పకవీయము ప్ర. 105
4. లక్షణసార సంగ్రహము ప్ర. 13, 69
5. బాలవ్యాకరణము అచ్చిక. 1
6. యయాతి చరిత్ర ప్ర. 14
7. అచ్చతెలుగు రామాయణము పీ. 18

ప్రకరణం - 5 :

| | | |
|---|---|---|
| 1. | వాల్మీకి రామాయణము యుద్ధకాండ ఫలశ్రుతి | |
| 2. | శ్రీమద్రామాయణ వైభవము | |
| 3. | రామాయణము యుద్ధకాండ విభీషణశరణాగతి | |
| 4. | తెలుగులో రామకథ - వంకా శమంతకమణి<br>తెలుగులో రామకథ - రావూరి దొరసామిశర్మ | |
| 5. | నిర్వచనోత్తరరామాయణము | ప్ర. 11 |
| 6. | అచ్చతెలుగు రామాయణము | పీ. 12 |
| 7. | పై | బాల. 7 |
| 8. | ,, | బాల. 8 |
| 9. | ,, | అయోధ్య. 14 |
| 10. | ,, | యుద్ధ. 594 |
| 11. | ,, | యుద్ధ. 595 |
| 12. | ,, | యుద్ధ. 596 |

ప్రకరణం - 6 :

| | | |
|---|---|---|
| 1. | లక్షణ సారసంగ్రహము | ప్ర 8 |
| 2. | పై | ప్ర. 9 |
| 3. | పై | ప్ర. 10 |

ప్రకరణం - 7 :

| | | |
|---|---|---|
| 1. | లక్షణ సారసంగ్రహము | ప్ర. 99 |
| 2. | పై | ప్ర. 31 |
| 3. | ,, | ప్ర. 32 |

4. ,, ప్ర. 48
5. ,, ప్ర. 34
6. ,, ప్ర. 34
7. ,, ప్ర. 59
8. ,, ప్ర. 36
9. ,, ప్ర. 109-125
10. ,, ప్ర. 143
11. ,, ప్ర. 169
12. ,, ప్ర. 204
13. ,, ప్ర. 338-444
14. వ్యాసరాజి
15. బాల వ్యాకరణము సమాస. 1
16. పై సమాస. 3
17. లక్షణ సార సంగ్రహము ద్వి. 18
18. పై తృ. 2-367
19. అప్పకవీయము ద్వి. 234
20. లక్షణ సార సంగ్రహము తృ. 340-366
21. పై తృ. 367

# ఈ వ్యాస రచనలో ఉపయోగించిన గ్రంథాలు


1. అచ్చతెలుగు రామాయణము - కూచిమంచి తిమ్మకవి.
2. అప్పకవీయము - అప్పకవి.
3. ఆంధ్రకవుల చరిత్రము (2,3 భాగములు) - కం॥ వీరేశలింగం పంతులు.
4. ఆంధ్రనాయక శతకము - కాసుల పురుషోత్తమకవి
5. ఆంధ్రనామ సంగ్రహము - పైడిపాటి లక్ష్మణకవి.
6. ఆంధ్ర భాషా భూషణము - మూలఘటిక కేతన.
7. ఆంధ్రభాషా వికాసము - గం.జో. సోమయాజి.
8. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - ఖండవల్లి సోదరులు.
9. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి.
10. ఆంధ్ర వ్యాకరణ వికాసము - అమరేశం రాజేశ్వరశర్మ.
11. ఆంధ్ర శబ్ద చింతామణి - నన్నయ.
12. కవిత్వ తత్త్వ విచారము - కట్టమంచి రామలింగారెడ్డి.
13. కావ్యాలంకార సంగ్రహము - మూర్తికవి - సన్నిధానం వ్యాఖ్య.
14. కుక్కుటేశ్వర శతకము - కూచిమంచి తిమ్మకవి.
15. కుమారసంభవము - నన్నెచోడ కవి.
16. జానుతెనుగు - వడ్లమూడి గోపాలకృష్ణయ్య.
17. తెలుగుభాషా చరిత్రము - సాహిత్య అకాడమీ ప్రచురణ.
18. తెలుగుభాషా చరిత్రము - టి భాస్కరరావు.
19. తెలుగు - మఱుగులు - వేటూరి ప్రభాకర శాస్త్రి.
20. తెలుగులో రామకథ - రావూరి దొరసామి శర్మ.
21. తెలుగులో రామకథ - పండా శమంతకమణి.
22. తెలుగు వాక్యము - చేకూరి రామారావు.

23. తెలుగు వ్యాకరణ వికాసము - బొడ్డుపల్లి పురుషోత్తం.
24. దశరథరాజనందన చరిత్రము - మరింగంటి సింగరాచార్యులు.
25. దేశి - కోరాడ రామకృష్ణయ్య.
26. నీలాసుందరీ పరిణయము - కూచిమంచి తిమ్మకవి.
27. పార్వతీ వల్లభ శతకము - కూచిమంచి తిమ్మకవి.
28. బసవ పురాణము - పాల్కురికి సోమన.
29 బాల వ్యాకరణము - చిన్నయసూరి
30. భాషా చారిత్రక వ్యాసములు - తూమాటి దొణప్ప.
31. భాషా పాఠములు - విష్ణుభట్ల సూర్యనారాయణ.
32. మహమ్మదీయ యుగము (1,2 భాగములు) - కొమర్రాజు లక్ష్మణరావు పంతులు.
33. యయాతి చరిత్రము - పొన్నిగంటి తెలగన.
34. రసికజనమనోభిరామము - కూచిమంచి తిమ్మకవి.
35. రాఘవ పాండవీయము - పింగళి సూరన.
36. రామలింగేశ్వర శతకము - అడిదము సూరకవి.
37. రామాయణ విశేషములు - సురవరం ప్రతాపరెడ్డి.
38. రుక్మిణీ పరిణయము - కూచిమంచి తిమ్మకవి.
39. లక్షణసార సంగ్రహము - కూచిమంచి తిమ్మకవి.
40. లక్ష్మణరాయ వ్యాసావళి (2 వ భాగము) - కొమర్రాజు లక్ష్మణరావు.
41. వ్యాసరాజి - జాస్తి సూర్యనారాయణ.
42. శివలీలా విలాసము - కూచిమంచి తిమ్మకవి.
43. శ్రీమద్రామాయణ వైభవము - మల్లాది గోపాలకృష్ణశర్మ.
44. సంస్కృతవాఙ్మయ చరిత్రము (2 వ భాగము) - మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
45. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (8, 12 సం.) - ఆరుద్ర.
46 సింహాచల మాహాత్మ్యము - కూచిమంచి తిమ్మకవి.
47. A study of Telugu compounds - Dr. J. Suryanarayana.

# "మాల దాసరి – శ్రీకృష్ణదేవరాయలు"

విశిష్టాద్వైత తత్వం విచిత్రమైంది. సామీప్య, సాలోక్య, సాకారాలతో ఆత్మ-పరమాత్మల అద్వైతాన్ని సాధించింది. ఆత్మ సద్గుణాల్ని సాధించి వైకుంఠంలో పరమాత్మ సామీప్యాన్ని చేరుకొంటుంది పరమాత్మను చూస్తూ కాలంగడిపే అవకాశం కలిగినందువల్ల సాలోక్యత సాధింపబడింది. పరమాత్మ మననంతో భ్రమర కీటక న్యాయంగా శంఖ చక్రాదులు త్రిపుండ్రములు పొంది సాకారత్వాన్ని పొందుతుంది. అయినా సర్వశక్తిమత్వంలేని కారణంగా పరమాత్మత్వం పొందదు అందువల్లే అద్వైతానికి చేరువలో భేదించింది.

శ్రీకృష్ణదేవరాయలు పరమభాగవతుడు. విశిష్టాద్వైతి. భగవత్తత్వాన్ని వివరిస్తూనే భాగవతుల కథలు 'ఆముక్తమాల్యద' కావ్యంలో వర్ణించినాడు ఈ కథల్లోను సర్వసాధ్యమైన నామసంకీర్తనంతో ముక్తి పొందిన 'మాలదాసరి' కథ ఈ కావ్యంలో చివరి కథగా అవుతుంది. విష్ణుచిత్తుడు, ఖాండిక్య కేశధ్వజులు, యామునాచార్యులు, గోదాదేవి, మాల దాసరి - వీరంతా భాగవతులే ఉత్తరోత్తర ప్రాధాన్యాన్నిబట్టి మాల దాసరి సర్వ శ్రేష్ఠుడు.

రాయలు ఈ కథను తీర్చటంలో నేర్పు చూపినాడు పండితులు ఈ కావ్యం 'పాషాణపాకం' అని పేర్కొన్నా. మాల దాసరి కథ మృదు మధురం. కథ నెత్తుకొనటంతోనే 'కలండొక రుండు పేరుకొననాని కులంబు మదీయ భక్తుడు' అన్నాడు. భక్తికి కులంతో పని లేదు అన్నదే ఇందలి భావం. మహాత్ములను కులగోత్రాదులతో చెప్పడం సంప్రదాయం కాదు. అతడు బ్రాహ్మవేళ మంగళనామ కైశికిని లాలసతో విష్ణువు నుద్దేశించి పాడుతాడు. ఒక రోజు 'కుంభ జానువు' అనే ద్విజ నిశాచరుని బారిన పడతాడు. అతనితో చేతనైనంత పోరాడి "ఓ రాక్షస! ఒక మాట విను. నేను నీకు కంచంలోని అన్నాన్నే అయినా ప్రాణరక్షణాన్ని ఉపేక్షించడం పాపం. అందువల్ల పెనగి నాకు మేని యెడ కాంక్ష లేదు. సఖ్యం సప్తపదీనం సుజనులకు వైకుంఠుని

చివరిసారిగా కీర్తించి రానిమ్ము" అని కోరినాడు బ్రహ్మరాక్షసుడు వినకపోగా "ఎవ్వని చూడ్కి జేసి జనియించు జగంబు. వసించు నిజ్జగంబెవ్వనియందు డిందు, మఱి యెవ్వనియందది, యట్టి విష్ణుతో సివ్వాల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదునేడ నే నెవ్విధినైన నిన్నదియ నేని" అని ప్రతిజ్ఞ చేసినాడు.

సర్వంవిష్ణుమయం జగత్ అన్నది ఈ ప్రతిజ్ఞలోని వివరణ. రాక్షసానుమతితో వెళ్ళి విష్ణువునుమంగళకైశికీతో అర్చించి తిరిగి వచ్చి 'నీ యురుకృపాకటాక్షమున జేసి ధన్యుడనైతి ననఘ" అని కృతజ్ఞతను వెల్లడించినాడు. పరమాత్మ సాక్షాత్కారానికి ప్రేరేపకుడైన ఆచార్యునిగా బ్రహ్మరాక్షసుని భావించటం మాల దాసరివైష్ణవలక్షణం. అందుకు బ్రహ్మరాక్షసుడు "మీ వంటి భాగవతులుం బావనులుగ జేయరేని మఱి గతి యేదీ మా వంటి వారి కిక మా యేవము వెనుకటిది చూడక రక్షింపు కృపన్" అని మాల దాసరినే ఆచార్యునిగా ప్రార్థించినాడు. 'పరస్పరం భావయంతః' అన్నట్లు ఒకరి నొకరు తమ కంటే గొప్పవారను భావన గలిగి ఉండటం మరో వైష్ణవ లక్షణం బ్రహ్మరాక్షసుడు తన శాపముక్తికి మంగళ కైశిక గీత ఫలమిమ్మని ప్రార్థించినపుడు, మాల దాసరి 'ఈ గీత ఫలం బింతయని' భక్తులకు తెలియదు. అదిగాక 'పుణ్యమమ్ముట కప్పురంబు పెట్టి యుప్పు గొనుట' వంటి దన్నాడు. దీన్నిబట్టి భాగవతునికి భగవంతుని భజనయేగాని ఫలాపేక్ష ఉండరాదని తెల్పినట్లైంది ఇది "మాఫలేషు కదాచన" అన్న గీతాచార్యుని ఆజ్ఞాచరణంగా భావించాలి.

ఈ విషయం బ్రహ్మరాక్షసుడు తన తొలి జీవితం వివరించి "గైశికీగానఫల దానంబున దీని మానుపవే?" అనిన, మాల దాసర "ఏను ఫలంబెరుగ, ఫలంబు పరమేశముఖోల్లాసంబు. యాజ్ఞాకైంకర్యంబులకు, నను మఱి కైంకర్యంబులకు ఫల పరిమాణ గణన ప్రపన్నుల కెక్కడియది. కాన బంధకంబగుట ఫలం బింతంత యందు గొంత గొమ్మన వెఱతు. భగవంతుడే రక్షించు నూఱడిలుము" అని మాత్రమే చెప్పినాడు. ఇందులో పరమాత్మ దాసత్వం, "యద్యద్భావ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపం" పూర్వ కర్మానురూపంగా ఏది ఎట్లు జరగవలసినదో అట్లే జరుగుననీ, కాని జన్మ జన్మాంతరాలో నీ పాద ద్వంద్వంలోనే నిశ్చలమైన భక్తి అబ్బేట్లు చూడు భగవాన్ అనే వైష్ణవ దాసుల లక్షణం ఈ మాల దాసరిలో సంపూర్ణంగా చూడవచ్చు అందువ ఆముక్త

మాల్యదలో రాయలు మాల దాసరినే ఉత్తమ భక్తునిగా చిత్రించటం జరిగింది. "స్వయం తీర్ణం పరాంస్తారయతి" విష్ణు నామ సంకీర్తనంతో తాను తరించి, కుంభజానువును కూడ తరింప చేసినవాడు మాల దాసరి అతని కథ చెప్పి రాయలు మనను కూడా తరింపచేసినాడు.

ఆత్మ - పరమాత్మల మధ్యనున్న భక్తికి 'పండిత-పామర', 'ధనిక-దరిద్ర', 'స్త్రీ - పురుష', 'ఉన్నత - నీచ' భేదాలు లేవని విష్ణుచిత్తుడు, యామునాచార్యులు, గోదాదేవి, మాలదాసరి కథలు నిదర్శనాలు నామసంకీర్తనం తపస్సు, ధ్యానం, యోగం, యజ్ఞం మొదలైనవానికన్న అధికమైందని 'తతోపి హరికీర్తనం' అనే సూక్తి వెల్లడిస్తుంది. ఈ విషయం వివరించటానికే కృష్ణదేవరాయలు 'మాల దాసరి' కథ వర్ణించినాడు భజనలో మైమరచి భగవంతునిలో చేరటం అనుభవసిద్ధమే.

—నెలవంక, 1991.

# కల్పవృక్షం - కల్యాణఖండం

జగమెరిగిన బ్రాహ్మణుడు విశ్వనాథ సత్యనారాయణ. కవి సమ్రాట్టాయన, ఆయన రాసిన 'శ్రీమద్రామాయణ కల్పవృక్షం' జ్ఞానపీఠ అవార్డునందుకొన్న గ్రంథం. దానిపై వచ్చిన ఖండన - మండన గ్రంథాలు వ్యాసాలు ఎన్నో. ఎంత ఎక్కువ చర్చకు వస్తే అంత నిగ్గు తేలుతుంది ఏమైనా కాలానికి నిలిచిన మహా కావ్యం కల్పవృక్షం అనటంలో అనౌచిత్యమేదీ లేదు.

'మఱల నిదేల రామాయణం బన్నచో' అని ప్రశ్నించుకొని తనదైన యనుభూతితోనే లోకం గతాను గతికంగా సాగుతున్నదని చెప్పి "తలచిన రామునే తలంచెద నేసును నా భక్తి రచనలు నావిగాన" అని జవాబు చెప్పినాడు విశ్వనాథ. అయితే అది నీరసం కాదని కవి ప్రతిభలో తాంబదిపాళ్ళు కొత్తదనం ఉంటుందని వివరించినాడు. అంతేకాక ఈ కావ్యాన్ని రాయటంలో 'తండ్రి యాజ్ఞయును జీవుని వేదన' రెండు ఏకమైనాయని స్పష్టపరచినాడు. ఈ విషయాల్నే బాలకాండంలోని కళ్యాణ ఖండం ఆధారంగా ఈ వ్యాసంలో చూపటం జరుగుతుంది.

కళ్యాణ ఖండం మొత్తం 303 పద్యాలు. మొదటి పద్యం, చివరి ఆరు పద్యాలు తీసేస్తే 296 పద్యాలు కథనానికి ఉపయోగపడినాయి. తొలి నూట ఏభై ఆరు పద్యాలు విశ్వనాథ ఉపజ్ఞ మూలకాలు. వాల్మీకం 73 సర్గలో 10 నుండి 24 శ్లోకాల వరకు మాత్రమే మూలానుసరణం ఉంది. అదీ స్వంత బాణీలోనే మిగిలినదంతా విశ్వనాథీయమే.

మిథిలానగరం రాజకులంలో దశరథ - జనకులు సమావేశమైనారు. లాంఛనంగా పెండ్లి ప్రస్తావన అవసరమవుతుంది మధ్యవర్తులు వశిష్ఠ విశ్వామిత్రులు. మా మంచి పెద్దలు ఈ ఇద్దరూ నిర్ణయిస్తారని దశరథుడు చెప్పి కూచున్నాడు. వశిష్ఠుడు ఇక్ష్వాకురాజుల ఔన్నత్యాన్ని వర్ణించి రామలక్ష్మణులకు సీతా - ఊర్మిళల నివ్వాల్సిందని జనకుని అభ్యర్థించినాడు. జనకుడు తన

వంశం రాజుల గొప్పతనాన్ని వర్ణించి "మీ రదగటం, నేను కాదనటమా? నా కూతుండ్ర నిద్దర ముమ్మాటికి మీ కిత్తునయ్యా బ్రహ్మర్షీ!" అని "రేపే యుత్తరా ఫల్గునీ ముహూర్తం" అన్నాడు. ఈ మాటకు విశ్వామిత్రుడు నవ్వి "మంచిది సెబాస్" అని జనకునితో "నీ వన్న మాటలో "క్రొత్తర్థము తాకి వచ్చెడు" అంటూనే రామలక్ష్మణులను మిథిలకు తెచ్చింది నేనుండగా "ఎవరి నడిగి ఇచ్చినావయ్యా? కష్టము నాది ఫలము వశిష్ఠులు కయినేనీ కొందురు? అయిందేదో అయింది మేమిచ్చెదము అన్నావు. కుశధ్వజుడు కూడ ఇక్కడే ఉన్నాడు "మీ మాండవి శ్రుతకీర్తియుఁ జాయలగుట వలయు భరత శత్రుఘ్నులకున్" అని చెప్పినాడు. ఈ మాటలకు అక్కడి వారందరు అంతఃపుర కాంతలు తెర వెనుక నుండే నవ్వినారు. ఈ పరిహాస ప్రసంగము పెండ్లికి సంబంధించిన విందే కాక వశిష్ఠ విశ్వామిత్రుల స్పర్ధను కూడా చాటుతుంది. సజ్జనుల స్పర్థ సకల జనులకు మేలు కలుగచేస్తుందనటానికి నిదర్శనంగా మలచనైంది. వివాహ బంధానికి "మూడు ముళ్ళు" అనటం ఆనవాయితి. దశరథుడు రేపటి శుభలగ్నంబునందె "నాల్గు ముళ్ళు పడ నిండు" అన్నట్టు కవి రాయటంలో ఔచిత్యం నాల్గు పెళ్ళిళ్ళు ఒకేసారి జరిపించమన్న ఔత్సుక్యాన్ని తెలుపుతుంది.

పరశు రామ వృత్తాంతాన్ని "ధనుస్సు" ఖండంలోనే ముగించినాడు. పెండ్లి పనుల్లో తెలుగునాటి ఆచార వ్యవహారాలన్నీ ప్రవేశ పెట్టినాడు. "పెండ్లి నడక" అనే జాతీయార్థాన్ని "వాద్యముల్ పెండ్లివారు మున్ వెనుక, సద్యోమహాలసత్వమగు నడక చోద్యమౌ ననంగఁ జూడఁగా సర్వ హృద్యమై తోఁచె నెద ముదము బర్వ" అనే పద్యంలో వివరించినాడు. వియ్యంపువారు కలుసుకొన్న విధాన్ని "ఒక పెద్ద కెరటము నొక పెద్ద కెరటము గలసి యన్యోన్యంబు గౌఁగిలించు" అనే పద్యంలో వారి అన్యోన్యతకు వరుసగా ఉదాహరణము చూపినాడు. "స్వగృహే కో విచారోస్తి" అనే ప్రసిద్ధ వాల్మీకి శ్లోకాన్ని "పదడు పదడు నా యిచ్చుట యది మీరు గ్రహించుటయునునని కలదె? మీ యది యీ గృహంబు నిట యెల్లది మీ యిష్టాను సారమయ్యా! మహర్షీ!" అని అనువదించినాడు. వివాహ మండపం "వచ్చి యాకులతోడి పండిన గెలలతో మొదలి దుంపలతోడి కదళికలకు నాల్గు మూలల స్తంభ నాశత్వ మేర్పడ ప్రాలు మబ్బుల మినువోలెఁబైసి" (వ॥ 71) లో తెలుగునాటి వేదికాలం

కరణమే స్ఫురించింది. తెర పట్టుకోవటం, మంగళ సూత్ర బంధనం తలంబ్రాలు పోసుకోవటం మొదలైన ఆచారాలన్నీ 78 నుండి 95 పద్యాలదాకా వర్ణించబడినాయి. ఈ వర్ణనలో దంపతుల సాత్త్విక, అనుభావాది చేష్టలు "ఉత్తరాభిమన్యుల" అనుభూతినే ప్రకటించినా విశ్వనాథ పద్య రచనలో వైవిధ్యం సంతరించుకుంది. స్థాలీపాకం తర్వాత అరుంధతీ దర్శనం వశిష్ఠుడే చేయించినాడు. అయితే ఈ పద్యంలో పెండ్లికుండాల్సిన ప్రధాన లక్షణాన్ని కవి వర్ణించిన గడుసుతనం గమనించొచ్చు.

"ఎంత సాదువుగానైన నేమి తగవు
సుంత లేకుండఁ బెండ్లికి శోభ లేదు
అలుకు గుద్దకునై కలహంబు జరిగె
జనక దశరథ గృహ పరిచారకులకు" ప॥ 106

తోవలో అహల్యాశ్రమాన్ని రాముడు దర్శించాలంటే, దశరథుడు ఆశ్రమంలోనికి వెళ్ళినాడు. అహల్య నూతన వధూవరులకు దృష్టి తీసి హారతి పట్టినది నార చీర లిచ్చినది. ఆమె ఆజ్ఞతో అయోధ్యకు చేరి అమ్మలు అన్ని సౌకర్యాలు కూర్చగా చూచేవారి కనులు పండువుగా కొత్త సంసారం చేసుకొన్నారు సీతారాములు. అన్నదమ్ములందరి పరిస్థితీ ఇదే. కొన్నాళ్ళ తర్వాత మేనమామ వెంట భరత, శత్రుఘ్నులు కేకయ నగరానికి వెళ్ళిపోయినారు. ఇక్కడిదాకా తన తండ్రి కోరిక తీర్చిన కవి పైభాగమంతా జీవుని వేదన తన ఆధ్యాత్మిక భావనలకు రూప కల్పన కావించినాడు. ఇది కల్పవృక్షం ప్రత్యేకత. విశ్వనాథ వైశిష్ట్యం.

సీతారాముల శృంగారానికి వసంతం తోడైంది. దశరథుడు వసంతోత్సవాలు చేయించినాడు. వసంత ఋతు వర్ణన 174 పద్యం దాకా కవి సాగించినాడు. ఋతు వర్ణన మహా కావ్య లక్షణాలల్లో ఒకటి. ఆ ఋతువులో 'రఘువరాన్వయ రత్న కిశోర దంపతులు 'మాసరమైన యట్టి మధు మాస దినంబునకున్ వశంవదు' లైనారు. 'త్రపాహసన భాసి కపోలములూది చూచుకోరాకరి మొగంబు నొక్కరు రహో బహు భావ గళత్రపాహతు' లైనారు. 'కలయకయే సమాగమ సుఖ ప్రవిభాగ కృతాత్ము లిద్దఱున్

సలలిత మూర్తులె'జనకజా రఘురాములు' దివ్య కాములై నారు. 'చేతములందు యుగాలు కల్పముల్ నాతియు పూరుషుండు గననంతర దంపతి భావ యాపనా వ్యాతత సంసృతి ప్రధము లైనటు లాత్మ దలంచు' చుండినారు. 'ఏపున నంటి నుండి యుదయించిన మైథిలి యింటినుండి యావాసముఁగన్న రాఘవుడువచ్చి యుగత్వములందు నుండె ద్యావా పృథువుల్ సమాహరణ భావము పొందిన రీతి సంగమ వ్యాప్తృతిఁ బండు వెన్నెల మయంబుగఁజేయుదురాత్మ రోదసిన్ ' జీవి ఉత్పత్తి తత్త్వం, మరో జీవితో మమేకమై కాలం గడిపే విధానం వీరి సాంగత్యంతో చూపినాడు కవి. అట్లా సీతారాముల సాంగత్యం సంవత్సర కాలం గడిచింది. మళ్ళీ వసంతం గడిచేటప్పటికి 'రాముని కంతలో నొక విరాగము, మైథిలిమీద నంతలో గామము, కామమెంతయు నికామము సాగి నిరాగమున్ హృదారామ విధూత కౌసుమ పరాగము' కాసాగింది. ఆ సమయంలో గ్రీష్మర్తు వర్ణనం కవి చేపట్టినాడు. 'గూఢ ప్రబంధ బలంబునఁ గుండలిన్యుదిత సముత్థాన గత భయాధీనమౌ పలాయ మాన దంపతి శుకాలాపములుగ గ్రీష్మవని యొక్క వైరాగ్యకేళి' నెరపింది. రాఘవ కులేశుఁ డొక్క వైరాగ్య భావ తాడితం బైనయట్టి చిత్తంబుతోడ వృద్ధ కృకలాప మట్లు నిర్వేదమందె బద్ధ సామజ మట్లు క్షోభము వహించినాడు. గ్రీష్మర్తువు తెలివి వెల్గున మాయ తొలగు నంటకు నెండకెండు సరస్సు సాదృశ్య మిచ్చినది. ''పైన పటారమ్ము లోన లొటారమ్ము మేనంచు రూపించె మేడిపండు'' 195 పద్యం దాకా గ్రీష్మ వర్ణనం సాగింది. రాముడు వశిష్ఠుని సమీపించి ఇట్లా ప్రశ్నించినాడు:

"స్వామీ! ప్రాణము కంటెఁ ఘ్రాణము ధరాజాతా ముఖాంభోజమే యేమోగాఁ గనపించు లో యెదదలో." చూచిన దానికై కనులు చూడవు. నాలుక తిన్న దానికై సాచదు, విన్న దానికయి సాగవు వీనులు, లో యెదం దలోఁ దోచియు దోచినట్టిదయి దూరము దగ్గర కాని సందడిన్ రాచిన రాపిడై యెరుగరానిది తాత! యనుగ్రహింపవే. నిద్దురపోయి మేలుకని నిద్దురపోయితి నంచు నెంచెదన్. నిద్దురపోవు వేళ ప్రభునిద్దుర పోవుచునుంటి నంచెదన్ దద్ది యెఱుంగ జాలను. అస్మదీయ మను చోద్యపు భావము పాయుటున్నె యేపాటిది యప్డు నేననెడు వస్తువు? దాని స్వరూప మెద్ది? ఇంటికి దివ్వె తెచ్చినటు లెప్పుడు వచ్చితి నిందు? పూర్వమెందుంటిని? ఎట్లు వచ్చితిని? కంటికి నిద్ర

తేనిదగు గాఢతరార్థము తేల్చి పెట్టవే!. ఆయాసం పడిపోవు చుంటిగదే తాతా! ఇదంతా కథాపరంగా భవిష్య ద్వియోగాన్ని సూచించే లక్షణం. అయినా కవి ఆత్మ వివేచన జీవుని వెదనగా ఇందులో చోటు చేసుకున్నది. జీవునికి కవికి, కవికి రామునికి అభేదం చూపటం గమనించదగ్గ విషయం. అది మరచిపోతే కావ్య పరమార్థమే వికృత మవుతుంది. జ్ఞాన పథాన్ని అన్వేషి స్తున్న రామునికి మరో యేడు గడిచి వర్షర్తువు వచ్చింది. అది బగటి దివ్వెల రాజవైభవముఁ దెచ్చినది. (218 పద్యం దాకా ఈ వర్ణన ఉన్నది.) అభిరామ మేఘుడు అశలందునన్ జెఱగడు త త్తథాగత విశేష గుణుండుగానే ఉన్నాడు. శరదృతువు వచ్చింది. అరుంధతి సీతను గమనించింది. వశిష్ఠుని దగ్గరకు రాముడు వచ్చినప్పుడు "కర్మయోగి జనకులు సంసార రేఖాక్రాంతులు కాని చిఱు కావి శాటుల జనుల్ మీరు కారంటూ' రాముణ్ణి మందలించింది. "రామా! మేలగు నెద్ది యంచడుగ గర్మ జ్ఞాన యోగోజ్జ్వల స్మ్రి మాంసా పఠిఁ గర్మ యోగమవుచో మేలందు నీ రెండునున్ శ్రీమంతంబులె బ్రహ్మ మెప్పుడవికారి త్వంబెయౌ'నని చెప్పి తనకుం జాలదూ సీత? నీ విభవ సౌందర్యంబులన్ జిక్కి నిన్నునె మన్నించునుగాక యెల్లప్పుడు తన్నుం జూచుకోలేదో?

చూడను వాంఛింపదు వాంఛరాద యదికూడన్ నీ ప్రభా ముద్రయే కనగా, బిడ్డలకై యరుంధతికి శోకంబేలనోయీ శిశూ?" అని వారి వియోగం పెద్దలకెట్లా దుఃఖకారణమవుతుందో వివరించింది. ఆ మాటకు రాముడు అరుం ధతి ముఖాన్ని చూచినాడు. భీతియు నచ్చెరువున్ మఱేదో బోధన శలిమిన్ వివేకమును దోర్కొనె నంతఁ బసన్న వాంఛయై తోచినది. తోచిన యంత సీతపై మలగిన మానసంబు నెదమన్ననయున్ ఘటియిల్లె లీలగా. ఆ తర్వాత హేమంతం వచ్చింది. అప్పుడు "ఒక్క దినమున నాలస్య మొప్ప వచ్చి యొక్క దినమున ముందుగా నొవ్వ నేగిఁ రామచంద్రుడు జానకీ ప్రేమ మరల వేయి విధములుగాగ నావిష్కరించినాడు. కాని జానకి మనః ఖిన్నత పాయ లేదు. రాముడు అయిన దానికి కాని దాని కేలిక తనాన జిల్లకఞ్ఞాలు పెంచ సాగినాడు సీత కేడ్పులు బాష్పములు. చివరకౌ "ఓయి వేదాంతి!" నిజంబు గానే జనకాత్మజ యిష్టము కాదయేనివ ర్తింతువయున్మనీ పద ధురీణుడ వీగతి నన్ను నేల బాధింతువు? అనుకూలుండవ యేని చన్న మూదేండ్ల వోలెను నాగుండియ భిన్న ధూర్జటి ధనుర్లీలాకరున్ నిన్ జిరంతను మన్నించుచు "జీవి

తొరితము నితాంతంబైన సంయోగభావన దీర్ఘ వ్రతమై చరింతు"నని పలికినది. రాముడు 'అల్పమొ వేగొ బ్రహ్మమను సాంతర వస్తువు వీగి నాదు సంకల్పమునందు సర్వమును గామిని నీవుగ నిండి యుంటివి కల్పితమైన మోహమను కాటుక చీకటి జిన్ని దివ్యమై శిల్పపు వెల్లుగాగ విరచింతువు నా హృదయాంతరంబునన్" "శ్రీ వశిష్ఠర్షి సాక్షిగా చెప్పుచుంటి నస్వతంత్రమ్మ యైన దేహమ్ము నందు నౌనోకాదో వచింపగలేను కాని యాత్మ నిన్ను నిత్యముగా హత్తుకొందు" అన్నాడు సీత ప్రీతయై యోర్చుకొన్నది.

మరో సంవత్సరం గడవగా శిశిరం వచ్చింది. అప్పుడు 'మదిలో దూర వియోగ భీతి రఘు రామ క్ష్మా సుతల్ దూరముల్ కదియం జొచ్చిన యట్లు తోచి యెదదల్ కంపింపగా సన్నిధుల్ వదలం జాలక ప్రేమ వాక్య రచనా వాల్లభ్య సంభావ సంపద సర్వస్వముగాగనై మసలిరి." ఒక కొంత భోగ వేళకు నికామ కామమ్ము తగ్గు నిండు ప్రకృతులందొక ముసరు కొనెడు పెను కోర్కయు శమించును హృషీక తృప్తి సహజమై. ఈ విధంగా వైరాగ్య సంసార భావాలు సమ ప్రసార రమ్యాలుగా సాగటం జీవధర్మమని, అదే జీవితమని ఈ భాగంలో విశ్వనాథ వ్యాఖ్యానించినాడు. అనుభవము, ఆలోచన అనే రెండూ జీవ ధర్మాలని, వాటిని సరిగా వాడుకోవటంలోనే జీవయాత్ర సాగుతుందని జీవుని వేదన ద్వారా నిరూపించినాడు కవి.

—నెలవంక, 1992

# 'రామాయణ చంపువులో తెలుగు ప్రాసలు'

తెలుగు భాషా సాహిత్యాలకు యతిప్రాసలు మంగళసూత్రాలని కొరవి గోపరాజు పేర్కొన్నాడు. ఉన్న మాటంటే ఉలుకెక్కువ. చేసిన పని చెప్పుకో పటంవంటి సామెతల్లో, జాతీయాల్లోకూడా ఇవి ప్రయుక్తాలై జన సామాన్యం వాడుకలో జీర్ణించుకుపోయినాయి.

తెలుగు వారైన సంస్కృత కవులు ఈ ప్రత్యేకతల్ని తమ రచనల ద్వారా ఇతర ప్రాంతాలవారికి దీని సౌందర్యాన్ని చూపారు. దీనికి ముగ్ధుడైన **భోజరాజు** (క్రీ. శ. 1000 - 1055) తన చంపూ రామాయణంలో ఎట్లా వాడుకున్నాడో ఈ వ్యాసంలో కొన్ని ఉదాహరణలు చూపుతున్నాను. నన్నయ కాలం వాడైన భోజరాజు సంపూర్ణంగా లక్షణ శాస్త్రం వృద్ధి చెందనందువల్ల నేమో ఈ యతి - ప్రాసల్ని కొన్ని విధాల వాడినాడు. వాటి నీ విధంగా విభజించుకోవచ్చు. ముఖ్యంగా 'ప్రాస'కు ఉదాహరణ లివి.

1. నాల్గు పాదాల్లోను ప్రాస ఉన్నవి.

2. మూడు పాదాల్లో ఉన్న ప్రాస భేదాలు — a) 1, 2, 3. b) 1, 2, 4. c) 1, 3, 4. d) 2, 3, 4.

3. రెండేసి పాదాల్లో ఉన్న ప్రాస భేదాలు — a) 1, 2 & 3, 4. b) 1, 3 & 2, 4 c) 1, 4 & 2, 3.

4. రెండు పాదాల్లో మాత్రమే ప్రాస ఉన్న భేదాలు a) 1, 2. d) 1, 3. c) 1, 4. d) 2, 3. e) 2, 4. f) 3, 4. ఇవికాక -

5. ద్విప్రాస, త్రిప్రాస, అంత్యప్రాస, దుష్కరప్రాస మొదలైనవి. ద్వితీయోవర్ణః ప్రాసోఽత్ర పాదపాదేషు

ప్రతి పాదంలో రెండోవర్ణం ప్రాస. ప్రకృష్ట వర్ణ విన్యాసం ప్రాస అని అర్థం. ప్రాసలో వ్యంజనానికే ప్రాముఖ్యం.

కొన్ని ఉదాహరణలు -

1. నాల్గు పాదాల్లో సంయుతాక్షర ప్రాస-

పర్యాప్త భాగ్యాయ భవానము ష్మై
కుర్యాత్స పర్యాం కుశికాత్మ జాయ।
విర్యాతుధానాం వసుధాం విధాతుం
నిర్యాతు రామస్సహ లక్ష్మణేన॥ (బాల. కాం 66)

మొదటి రెండు పాదాల్లో యతి కూడా ఉంది

2. పూర్ణ బిందు సమ ప్రాస -

ఖండనాయ వసుధా మదూనసః
పుండరీక తుహిన త్విషాం ద్విషాం।
దండకా వన మవాప రాఘవః
చండ భాను రివ మేఘ మండలమ్॥

(అయో - 184)

3 ద్విప్రాసం ఈ శ్లోకంలో -

ఖర పరుషి శరాసనే గృహీతే
ఖర కిరణాన్వయ శేఖరేణ తేన।
ఖర రఘువరయో రణం సమాప్తం
ఖర నఖరాయుధ యోరివ క్షణేన॥ (అరణ్య - 49)

4 దుష్కర ప్రాసకి ఉదాహరణ -

రక్ష స్సంఘట్ట చూర్ణీకృత కనక మహాభిత్తి చైత్యోత్థ ధూళ్యా
నక్షత్రాణా మకాలే సరణి మరణయన్ వీరలక్ష్మీ సమేతః।
రక్షశ్శూరాఖ్య శారాం క్షితితల ఫలకే క్షేపణీ యాం హనూమా
నక్షక్రీడాం విధాతుం దశముఖనగరీ చత్వరేత్తత్వరేఽసౌ॥(సుందర-75)

5 మొదటి రెండు పాదాల్లో త్రిప్రాస - తర్వాతి రెండు పాదాల్లో చతుఃప్రాసగల శ్లోకం.

యాతునః పదవీ సైషా
యాతున శ్చాస్య లక్ష్మణ।
యాతుకామం తయైవేదం
యాతు కామం నహస్యతాం॥ (అరణ్య - 10)

6. 1, 2, 3 పాదాల్లో 'శ' కార ప్రాస -

నిశిచర పతి రిత్యవేత్య రోషాత్
అశని నిపాత నిభేన తాడనేన।
అసుర హిత మముం ప్రహృత్యదైత్యం
సురహితమేవ చకార వాలిసూనుః॥ (కిష్కింధ - 84)

7. 1,2 పాదాల్లో, 3,4 పాదాల్లో వేర్వేరక్షరాల త్రిప్రాసమిది -

జననీతి విహీనామే
జననీ తి సధర్మవిత్।
నిరయా న్నిరయాద్వీరో
నిరయాదివ సానుజః॥ (అయోధ్య - 152)

8. మొదటి రెండు పాదాల్లో మాత్రం ఉన్నవి చాల శ్లోకాలు -

"గద్యాను బంధ రసమిశ్రిత పద్యసూక్తః
హృద్యా హి వాద్య కలయాకలితేవ గీతిః।" (బాల-3)

"తతో హనూమాన్ దశకంఠసీతాం
సీతాం విచేతుం పధిచారణానామ్।" (సుందర - 1)

"ఇతి వివిధ రసాభిః కౌశిక వ్యాహృతాభిః"
శృతి పథ మధురాభిః పావనీభిః కథాభిః। (బాల - 86)

"వాచాం నిశమ్య భగవాం స్తతు నారదస్య
ప్రాచేతసః ప్రవచసాం ప్రథమః కవీనాం।" (బాల - 5)

9. 1, 3 పాదాల్లో ఒక అక్షరం, 2, 4 పాదాల్లో మరో అక్షరం ప్రాస కూర్చిన శ్లోకమిది-

అనుజ రచిత వర్ణాగార హృద్యాసు మాద్యత్
పరభృత గళచంచ త్పంచమై రంచితాసు।
జనక దుహితృయోగా జ్ఞాన సాకేత సౌఖ్య
శ్చిర మరమత రామశ్చిత్ర కూట స్థలీషు॥ (అయోధ్య-121)

10. 1, 3 పాదాల్లో కూర్చిన పద్యం -

అపిబదియ మమంత్రే కాలయోగా న్నరేంద్రే
వరయుగ రసనాభ్యాం ప్రాణవాయుం తదీయం।
అపనగర మముష్యా వర్తనం యుక్తరూపం
పితృవన వసుమత్యాం క్వాపి వల్మీకవత్యామ్॥ (అయోధ్య-150)

11. 1, 4 పాదాల్లో ప్రాసమున్న పద్యం ఇది-

తదను శూల మఖండ యదంజసా
శిత శిఖం రఘునాయక సాయకః।
నియతమేవ విరాధ విరోధి నాం
హృదయ శూల మపి త్రిదివౌక సామ్ (అరణ్య-7)

12. 2, 3 పాదాల్లో ప్రాసమున్న పద్యం -

ఏనాం పురాణ నగరీ నగరీతి సాలాం
సాలాభిరామ భుజనిర్జిత యక్షరాజః।
హేలాభిభూత జగతాం రజనీ చరాణాం
రాజా చిరాదవతి రావణనామధేయః॥ (బాల - 31)

13. 2, 4 పాదాల్లో ప్రాసకి పద్యం ఉదాహరణ -

కల్యాణ వాద సుఖితాం సహసైవ కాంతాం
కాంతార చార కథయా కలుషీ చకార।
అంభోద వాద ముదితాం విపినే మయూరీం
సంత్రాసయన్నివ ధనుర్ధ్వనినా పుళిందః॥ (అయోధ్య - 70)

14 3, 4 పాదాల్లో ప్రాసమున్న పద్యాలు చాల ఉన్నాయి.

అస్తి ప్రశస్తా జనలోచనా నా
మానంద సందాయిమ కోసలేషు।
అజ్ఞా సముత్సారిత దానవానాం
రాజ్ఞా మయోధ్యేతి పురీ రఘూణామ్॥ (బాల. 15)

15. 'క్త్వా' ప్రత్యయంతో కూడిన దుష్కర ప్రాస నాల్గు పాదాల్లో కూర్చిన పద్యం ఇది -

హృత్వా ద్రేశ్శిఖరాణి తాని పరితః క్షిప్త్వా హసిత్వా క్రుధా
కృత్వా హస్త విఘట్టనం తత ఇతః స్థిత్వా నటిత్వాముహుః।
సిక్త్వా క్ష్మామసృజా ప్రసజాంత్ర కృతయా బధ్వాకచాన్ ఖేచరాన్,
దగ్ధ్వాగ్నే స్సదృశా దృశా నిశిచరా రుంధంతి రంధ్రం దివః॥ (బాల-89)

ఇవి వివిధ రకాల ప్రాసల దిఙ్మాత్రోదాహరణలే, సూక్ష్మంగా చూస్తే తెలుగు భాషా సౌందర్యా లెన్నో రామాయణ చంపువులో కన్పిస్తాయి. వాక్య రచన, క్రియాపదప్రయోగం మొదలైనవి తెలుగు భాషలోవలె కనపడతాయి.

—నెలవంక, 1993

## 'అనుముల' వారి అపురూప కావ్యం

# "నాగకన్యా పునరుద్వాహము"

బ్రహ్మశ్రీ అనుముల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అముద్రిత ప్రబంధాల్లో అపురూపమైంది 'నాగకన్యా పునరుద్వాహము' 1947 లో ఈ ఏకాశ్వాస ప్రబంధం రాసినట్లు, దీని వెంటనే 1948 జనవరిలో జరిగిన అద్భుత సంఘటనకు స్పందించి రాసుకొన్న "నాగ కుమార నవరత్నములు" వల్ల గుర్తించ వీలౌతుంది. మహాభారతంలోను, విజయ విలాసంలోను, కందుకూరి వారి రసికజన మనోరంజనంలోను వర్ణితమైన 'అర్జున - ఉలూచి' వివాహ కథ ఈ కావ్యంలో ఇతివృత్తం

శాస్త్రిగారి రచనా వ్యాసంగ కాలంలో ఆంధ్ర దేశంలో స్త్రీ పునర్వివాహ ఉద్యమం ముమ్మరంగా సాగుతుండింది. ఆ ఉద్యమానికి ప్రతిస్పందించిన శాస్త్రిగారు పౌరాణిక కథను గ్రహించి సమకాలిక సమస్యను సమర్థించటం ఈ కావ్యంలో గమనిస్తాం అయితే శాస్త్రిగారి పాండిత్యం, ధర్మశాస్త్ర పరిశీలనం, వాటికి తోడు మానవతా హృదయం స్పష్టంగా ఇందులో ప్రతిబింబించింది.

'ఉలూచి' విధవ అయిన వృత్తాంతం ప్రసిద్ధ ప్రబంధాల్లో ఎక్కడా సూచనా మాత్రంగానైనా కనపడదు. తానై అర్జునుని కీర్తి, సౌందర్యాలకు ఆకర్షితురాలై అర్జునుణ్ణి తన లోకం లోనికి కొనిపోయినట్లు, అనుభవించి ఇరావతుడనే కుమారుని కని ఆ లోకానికి రాజును చేసుకొన్నట్లు వర్ణింపబడింది. కాని శాస్త్రిగారు తనకు దొరికిన ఆధారాన్ని ప్రబంధం వెనుకనే శ్లోకాలను రాసి పెట్టుకొన్నారు. ఆ ఆధార శ్లోకాలివి—

### యిందుకు మూలము

౧ శ్లో॥ అర్జునస్యాత్మజ శ్శ్రీమాన్ ఇరావాన్నామ వీర్యవాన్।
సుతాయాం నాగ రాజస్య జాతః పార్థేన ధీమతా॥

౨. ఐరావతేన సాదత్తా హ్యనపత్యా మహాత్మనా।
పత్యౌహతే సువర్ణేన కృపణా దీన చేతనా॥

౩ భార్యార్థం తాంచ జగ్రాహ పార్థః కామవశానుగాం।
ఏవ మేష సముత్పన్నః పరక్షేత్రేర్జునాత్మజః॥

౪. స నాగలోకే సంవృద్ధో మాత్రాచ పరి రక్షితః।
పితృవ్యేణ పరిత్యక్తః పార్థ ద్వేషాద్దురాత్మనా॥

౫. రూపవాన్ బల సంపన్నో గుణవాన్ సత్య విక్రమః।
ఇంద్రలోకం జగామాశు శ్రుత్వా తత్రార్జునం గతమ్॥

౬. సోభిగమ్య మహా బాహుః పితరం సత్య విక్రమం।
అభ్యవాదయత హ్యగ్రే నియమేన కృతాంజలిః॥

౭. న్యవేదయత చాత్మానయర్జునస్య మహాత్మనః।
ఇరావానస్మి భద్రంతే పుత్రశ్చాహం తవ ప్రభో॥

౮. మాతుః సమాగమోయస్తు తత్సర్వం ప్రత్య వేదయత్।
తచ్చ సర్వం యధా వృత్తం అను సస్మార పాండవః॥

౯. పరశ్వాస్య సుతం చాపి సోత్మనః సదృశం గుణైః।
ప్రీతి మానభవత్పార్థో దేవరాజ నివేశనే॥

(ఇతి భీష్మ పర్వాంతర్గత బీష్మ వధ పర్వణి
ఏక నవతిత మాధ్యాయే సప్తమ శ్లోకాది—)

దీన్ని ఆధారంగా తీసుకొని శ్రీ పునర్వివాహ సమస్యకు చక్కని పరిష్కారం కావ్యం ద్వారా చూపదలచుకొన్నారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. కాని ఇదే ఘట్టాన్ని రాస్తూ తిక్కనగారు ఇరావతుడు కౌరవ సేన నడ్డుకొన్నపుడు కాని, అలంబుసుడు అనే రాక్షసుడు ఇరావతుని చంపగా భీముని వల్ల విన్న అర్జునుడు దుఃఖించేటప్పుడు కాని అతని జన్మ వృత్తాన్ని ఉలూచి విధవా వృత్తాన్ని వివరించలేదు. కారణం వ్యాసుని కాలానికి, తిక్కన కాలానికి మధ్య వచ్చిన స్మృతి గ్రంథాలు, ఆచార వ్యవహారాల మార్పు కావచ్చు.

ఇరావతుని గూర్చి తిక్కనగారి పద్యాలివి—
వెక్కస మాడుచు గురువతి
రక్కసుతో ననియె నియ్యురగ దౌహిత్రు
డొక్కడ మనసైన్యంబు
ల్సొక్కడచుచు నున్నవాడలంబుస కంటే. (భీష్మ. 3 ఆ. 99)

జననీ వంశంబునగల
యనుపమ మాయానుభావ మాత్మదలచి శే
షుని చందం బగు రూపం
బున చేర్చి యనేక నాగ పుంజముతోడన్. (భీష్మ. 3 ఆ. 104)

అపుడు నేరిభీముc డతనికి భుజగేంద్ర
కన్యకాసుతుండు గలనcబడుట
నల్లcజెప్పుటయును నడలి యెచ్చట నని
యడిగి యతcడు నూప నచటికరిగి (భీష్మ, 3 ఆ. 154)

దనుజ ఖండితుండయి పడియున్న యయ్యిరావంతు
శరీరంబు గనుంగొని యా ధనంజయుండు (భీష్మ, 3 ఆ. 155)

ఈ ఘట్టాన్ని చూచిన సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, విజయ విలాసాది ప్రబంధాలు చదివి తన కాలానికి అవసరమైన సంస్కరణవాదానికి వ్యాస

భారత శ్లోకాలే గ్రహించినారు. 183 పద్యాల్లో ఏకాశ్వాస ప్రబంధంగా తీర్చ టానికి అనువైన విధంగా కథను మలచుకొన్నారు. ఈ ప్రబంధాన్ని హరిహర స్వామికే వినిపించారు. వారి కథ ఈ విధంగా రూపుదిద్దుకొన్నది.

నాగపట్నాన్ని ఐరావతుడనే సర్పరాజు పాలిస్తున్నాడు. కౌరవ్యుడు అనే కొడుకు, ఉలూచి అనే మనుమరాలు ఉన్నారు. తక్షకుని కుమారులు అశ్వసేనుడు, శ్రుతసేనుడు అనే వాళ్ళలో శ్రుతసేనునికి ఉలూచిని చిన్నపుడే ఇచ్చి పెళ్ళి చేశాడు. అతడు ఖాండవము, కురుక్షేత్రాల పాలకుడు. శ్రుత సేనుడు మహాద్యుమ్న తీర్థంలో మహాదేవుని గూర్చి తపస్సు చేస్తుండగా వైనతేయుడు అతన్ని సంహరించాడు. అశ్వసేనుడి ఆగడం భరించలేక ఉలూచి తండ్రి పంచ చేరుకొన్నది.

కొంతకాలానికి అర్జునుడు తీర్థయాత్రలు చేస్తూ గంగాతీరానికి రాగా తండ్రి పంపున కౌరవ్యుడు అర్జునుని దగ్గరకు వచ్చి యదువంశ ఆర్యకుని సంబంధంతో తాను వేలువిడచిన మేనమామ నవుతాననీ, ఐరావతుడు నిన్ను చూడటానికి ఆహ్వానిస్తున్నాడనీ వివరిస్తాడు. అర్జునుడు తాతగారిని చూడాలని నాగపట్నం వెళతాడు. అక్కడి పౌరులు అర్జునుని చూచి—

> ఇతడుకా పాండు భూపతి మున్ను చేసిన
> ప్రకట తపో విభూతికి ఫలంబు
> ఇతడకా గొంతి యద్భుత మంత్ర శక్తిచే
> నవనికిఁ దేఁబడ్డ యాదిమర్షి
> యితఁడకా ద్రుపద రాట్సుతకుఁ దొల్లింటినో
> ముల పంట యగుచు రాజిలు మగండు
> ఇతఁడకా విశ్వవిద్యాధిపతికి నసుఁగ
> లంపుఁజెలికాడు శ్రీవత్సలాంఛనునకు
> భళిరె! యీ దివ్యతేజ మీ ప్రాభవంబు
> వాసవున కొక్కనికిఁదక్క వసుధ గలదె.

అని కొనియాడినారు. ఐరావతు డాతని కౌగిట చేర్చుకొని పోరాని చుట్టమని సంతోషించినాడు. ఉలూచిని చూపి ఆమె వృత్తాంతం అర్జునునికి వినిపించినాడు.

అశ్వసేనుడు తనపై కత్తికట్టినట్లు చెప్పి—

ఇట్టి యిడుములకు హేతువు
కట్టఁడియగు నశ్వసేను కాపరమది నీ
యట్టి భువనైక వీరుని
చుట్టరికమువలనఁగాని సురుగద యెందున్ (ప. 44)

అని అర్థించినాడు. ఉలూచిని చూచిన అర్జునుడు....

అన్నగు మోమును నాక్రా
గన్నులు నమ్మద మరాళ గమనమునమ్మె
క్రొన్ని గఁదనమదిఁ బాయమి
కిన్నగి వన్న గిఁదలంచి క్రీడి మనమునన్ (ప. 47)

ఐరావతు మాటలు దగ
నారసి యారసికుఁడట్టు లాఁడుట దనక
న్నారీ రత్నము గారవ
మారఁగ నీఁగోరియో యటంచుఁ దలఁచుచున్ (ప. 51)

తనలో—ఒక్కసారి యొకని కిచ్చిన కన్యఁదా
రీరువెండి, యొక్కసారి యిత్తు
మన్నమాట దిరుగ రట్లొక్కసారి పా
ల్గొన్న దానికానగొనరు బుధులు (ప. 53)

అంతేకాక—పృథునిభార్యయంద్రుడు పృథివి, దొల్దొలుతనె
వ్వాఁడు దున్నెఁబొలము వాని దంద్రుడు,
మొదలనెవని తూపు మొనదాకె నతనిద
యంద్రుడు మృగముఁ జెలియునట్ల పతికి (ప. 56)

అని యూరకున్నాడు. ఉలూచియు మన్మధవశయై.

చెలికత్తెతో—పుట్టినప్పటినుండియుఁబుత్రి నన్యు
ధనము కానేల చూతురో తల్లిదండ్రు
లింతలోపల మునిగెడి దేమి తమకఁ
బెండ్లియని తీవరింతు రాజేంద్రసుతకు (61)
అని బాల్యవివాహాన్ని నిరసించింది.

ఒకని కోరులీయనేల తన్నువిద తాన
వలచి వలపించికొని పొందవలఁతి గాదె
నియమ బంధంబు లవలఁ బన్నికొనరాదె
తనకువానికిఁ దగినంత దనుక కొన్ని (ప. 70)

ప్రాణులన్నింటి కొక్క సూత్రంబకాక
మనుజులకు నొండు సూత్రమే ఘనుఁడు వ్రాసె
నందు మగవానికొక సూత్రమాడుదాని
కొక్క సూత్రమునట్టి యెట్లోర్వవచ్చు (ప. 73)

అతివలకు కామం అష్టగుణమన్నవాళ్ళే నవ యవ్వనంలో పతిపోతే సన్యాసంలోకి త్రోసినారు స్త్రీని. కొందఱుచితజ్ఞులు ఆపదలలో ఈ ధర్మము చెల్లదని, తాను కోరిన వానిని పొందని స్త్రీ కన్యయే పొమ్మన్నారు. (78) అని చెప్పి—

ఏనెదుటఁబోయి నిలుతున
యేనిన్ హరుఁడైనఁదెరలు నిన్నరుఁడేలా?
కానీ చూతము పటుతర
సూన శరగ్లాని నిచట స్రుక్కఁగనేలా! (82)

అని నిశ్చయించుకొని అర్జును దేమి చేయుచున్నాడో తెలుసుకొని రమ్మని చెలికత్తె నంపినది. కాని అప్పటికే భుజంగపతి ఆజ్ఞగొని వెళ్ళినట్లు తెలిసి తపించినది. ఆరాత్రి అభిసారికావేషముతో అర్జునుని పటకుటీరమునకేగి చూచినది. అప్పటికే ఐరావతుడు రాయబారిగ పంపిన బ్రాహ్మణుడు

'ఉలూచి'ని వివాహమాడుమని కోరెను. ఒక్కకూతురు, దాని సంతానమే రాజ్యమేల కోరుచున్నాడని పలికెను. అర్జునుడు విధవావివాహమగునని, అందులో తను తలదూర్చజాల ననెను. ద్విజుడు అనేక ధర్మశాస్త్రమతాల్లోని 'విధవ' లక్షణాలు వివరించి చివరకు—

తలిదండ్రులు గురువులునా
గలవారి పనేమి? తనదు కామము తన్నిఁ
గలయది గావునఁజెలితన
వలచిన పురుషవరుఁబొందవచ్చుంజుమ్మీ (127)

అని చెప్పినాడు. అర్జునుడు 'తుది సిద్ధాంతము దైవ ప్రచోదితము నాకిచ్చోన్' (131) అని ఊరకున్నాడు. బ్రాహ్మణుడు వెళ్ళిన తర్వాత వారి మాటలు విన్నందువల్ల, అర్జునుని పరాధీన మనస్కతను జూచి ఉలూచి మెఱుపు మెరసినట్లు అతని ఎదుటకు వచ్చి తన మాయాప్రభావంతో అర్జునుని తన అంతఃపురంలోనికి చేర్చింది. అక్కడ ఉలూచిని చూచిన అర్జునుడు—

ఎవ్వతవీవు పంకజదళేక్షణ! యీ క్షణదాంతరంబునం
బువ్వను బోలె నన్నుఁబొరిపుచ్చి వెసంగొని తెచ్చితిట్లు న
న్నెవ్వనిగాఁదలచి భ్రమియించితొకో యెఱుగంగరాదునీ
మవ్వపుమేను జవ్వనము మాకనుమానము సేసెడుంగడున్ (144)

అనగా ఉలూచి నీ కీర్తిప్రతిష్ఠలు చిన్నప్పటినుండి విని నిన్ను వల గొన్నాను అన్నది. అర్జునుడు అభ్యంతరము చెప్పగా ఉలూచి—

తెలియంజాలనినాఁ డదేమయినదో దేవాధ! యేమైనఁబె
ద్దల దోసంబది నాకదేల యటుపై ద్వద్దర్శనంబుంద్వదు
జ్జ్వల తేజస్మరణంబుఁ ద్వచ్చరణ సేవాతత్పరత్వంబునా
గల దోషత్రితయంబు దక్కగ నెఱుంగంజావ్వే యేదోషమున్ (154)

అన్నది. అంతేగాక కురువంశంలోని పుట్టుమట్టులన్నీ పేర్కొని—

ఎంతటివారికైనఁ దమయెగ్గులు గుమ్మడికాయలంతలా
వంతలు గావ యొర్ల విసుమంతలు గుమ్మడికాయలంతకా
నింతననేల ద్రౌపదికి నేమగువారలొ మీరు బావల
త్యంతము దంద్రులట్ల సుతులట్ల కదా! మఱదుల్ జగంబునన్ (156)

అని ఇంచుకమీరి పల్కినాను, మీ కరుణకు పాత్రురాలని పాదములపై వ్రాలినది - (159) అర్జునుడు—

ఆ నిపుణత కవశుండై
మానవపతి ప్రీతివేచి మరులేచి సరో
జాననడాని యనంగ
గ్లాని యడంగంగఁ గ్రుచ్చి కౌఁగిటఁ చేర్చెన్ (162)

ఈ విధంగా ఈ కథ సుఖాంతమైంది. ఆ తర్వాత గర్భవతియై ఇరావతుని కనటం, అతడే నాగపట్నానికి రాజవటం వర్ణితమైంది.

ఈ పౌరాణిక కథ ద్వారా బాల్యవివాహ నిరసనం, వితంతు వివాహ సమర్థనం, వివాహ వయో నిర్ణయం, స్త్రీ స్వాతంత్ర్యం మొదలైన కవి కాలం నాటి సమస్యలకు పరిష్కారమై ఈ 'నాగకన్య పునరుద్వాహము' అపూర్వంగా ఉన్నది. సహృదయులు చదివి ఆనందించటానికి త్వరలోనే ముద్రిత మవుతుందని ఆశిద్దాం.





## డా॥ కె. వి. సుందరాచార్యులు

M. A, Ph. D.

గుమ్మడిదల, మెదక్-జిల్లా

| | | |
|---|---|---|
| జననం | : | ఏప్రిల్ 4, 1937 |
| ఉద్యోగం | : | ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాల ఉపన్యాసకులు |
| అభిరుచి | : | సంస్కృతాంధ్రాల్లో శాస్త్ర-సాహిత్యాల అధ్యయనం, అధ్యాపనం, రచన.<br>ఎం. ఫిల్, పి హెచ్. డి. విద్యార్థులకు మార్గదర్శకత్వం. |
| రచనలు | : | అచ్చతెలుగు కృతులు-పరిశీలనం<br>అచ్చతెలుగు రామాయణంలో భాషా విశేషాలు<br>తెలుగు రచన<br>విభిన్న విషయాలపై వివిధ పత్రికల్లో-<br>ఆకాశవాణిలో వ్యాస-ప్రసంగాలు |